# శ్రీశైలేశచరితము

(ద్వితీయ పుష్పము)



రచయిత:

వాడేల వేంకట శివగిరిరావు, రావిపాడు.

ఆయుశ్వోనిక్ డాక్టర్.

శ్రీలక్ష్మి గణేశ జ్యోతిషాలయం,

రావిపాడు. కంభంతాలూకా, కర్నూలుజిల్లా.

1949

గావ్యు-౧౦ మాపి )

వెల 0 -12 - 0



# కృతి సమర్పణము.



శ్రీశైలనిలయుడగు

శ్రీ భ్రమరాంబా సహిత

మల్లికార్జునస్వామి పాదారవిందములకు

సమర్పించు మత్కృత

ద్వితీయ పుస్తక సుమము.



# శ్రీ శై లే శ చ రి త ము






శ్రీలక్ష్మీగణేశజ్యోతిషాలయం, రావిపాడు

కంభంతాలూకా, కర్నూలుజిల్లా.

1949

హక్కులు మావి )                వెల 0—12—0

శ్రీ వాడేల వేంకట శేషగిరిరావుగారిచే రచింపబడిన శ్రీశైలేశ చరితము నామూలాగ్రము చూచితిని.

మహాశయా!

మీరు పంపిన భవద్విరచిత మగు శ్రీశైలేశ చరితము నామూలాగ్రముగ జదివితిని. అందలి వచనరచనా చతురిమయు, పద్యముల ధారాశుద్ధియు, నాయా సందర్భములం దెంతయు, దగియున్నవి. అన్నిటికన్న ముఖ్యముగ నా చంద్రమతీదేవి గోపకుమారుల సంభాషణమెంతయు హృద్యమై పాఠకుల హృద [illegible] భక్తిప్రపత్తుల రేకెత్తింప గలిగియున్న దనుటలో నావంతయు సందియము లేదు.

"నీలాల నింగిలో" మున్నగు పద్యములయందలి ప్రశ్న సమాధానముల తోగూడిన రచనయు నందందు నిరూపితములగు ధర్మములును మీ యుత్తమమగు కృషికి నిదర్శనములుగా జ్వలి యున్నవి.

శ్రీశైలేశ్వరుడు మీ ముఖమున జెప్పించుకొన్న తన యీ చరితమును విశ్వవ్యాప్తము చేయునుగాత.

ఇట్లు,

విబుధ విధేయుడు,

విద్వాన్: **పోపూరి నరశింహస్వామి.**

P. O. L.

తెలుగు పండితుడు – బోర్డుహైస్కూలు,

కంభం – కర్నూలుజిల్లా.

శ్రీ లక్ష్మీగణేశ దేవతాయనమః

శ్లో॥ కేదారే ఉదకంపీత్వా వారణాస్యాం మృతస్యవా
శ్రీశైలే శిఖరందృష్ట్వా, పునర్జన్మ నవిద్యతే॥

కేదారక్షేత్రమందు నీరుత్రావినను, కాశీక్షేత్రమందు మరణించినను; శ్రీశైలశిఖరమును దర్శించినను పునర్జన్మ లేదు.

శ్లో॥ గయాయాం యుగసాహస్రం కేదారే యుగవింశతి
వాసస్య లభతేపుణ్యం దినే నైకేన శ్రీగిరే॥

గయయందు కొన్నియుగములున్నను, కేదారక్షేత్రమం దిరువది యుగములు వసించినను వచ్చుపుణ్యము శ్రీశైలక్షేత్రమందొకదినము వసించిన మాత్రముననే లభించును.

శ్రీశైలము చాలపురాతనమైన దివ్యక్షేత్రము. త్రికాలవేదులగు మునిపుంగవులీక్షేత్రము మిక్కిలి పవిత్రవంతమైనదిగా గణించి తన్నామ పారాయణార్థము సంధ్యావందనమునందా నామము నిల్పియున్నారు. ప్రాచీన యుగములనుండియు పేర్వడసిన పుణ్యక్షేత్రములనిది యుత్తమోత్తమమైనదనుట సర్వవాదము.

శ్రీశైలమునకు నాలుగు ద్వారములు కలవు. పూర్వద్వారము త్రిపురాంతకమును, దక్షిణద్వారము సిద్ధవటమును, ఉత్తరద్వారము ఉమామహేశ్వరమును, పడమటిద్వారము అలంపురక్షేత్రము, ఈ నాల్గుపుణ్యస్థలముల మధ్యనుండు నావరణము శ్రీశైలభూమి యనబడును.

## —: క్షేత్ర వర్ణనము. —

(1) భస్మపర్వతము :— ఈ పర్వతమునందు విభూతియు, రుద్రాక్ష వృక్షములును లెక్కకు మిక్కిలిగా నుండును.

(2) స్ఫటికాద్రి :— ఇందు స్ఫటికములు, అనగా ఈశ్వరప్రీతికరమైన ఒకరకము గాజురాయి లభించును. దానిచే మాలికలు సిద్ధముచేయుదురు.

శ్రీశైలక్షేత్రము 30 యోజనముల పొడవు, ముప్పది యోజనముల వెడల్పును గలిగి యనేక దివ్యతీర్థములు క్షేత్రములు కలిగి యొప్పారుచుండును. ఇందనేక యదృశ్య క్షేత్రములు, తీర్థములును కలవు. కావున శ్రీశైలము క్షేత్రరాజమును, జన్మ రాహిత్యమొసఁగు పుణ్యస్థలమునునై యున్నదని ఋషిపుంగవులు నిర్వచించియున్నారు.

ఓమ్.

# శ్రీ శై లే శ చ రి త ము.



పూర్వము కృతయుగమున శిలాదుఁడను ఋషిపుంగవుఁడొకఁడు కలఁడు. అతఁడు సంతానార్థియై, కైలాస నిలయుంగూర్చి తపంబొనర్ప నుత్సాహవంతుండై యొక సుముహూర్తమున నిల్లువిడి, యొక విజన ప్రదేశంబునకుంజని, యందుచిత స్థలంబొండు నిర్ణయించుకొని తపంబునకుం గడంగె. మానసం బింద్రియముల నంటనీయక, రిపుషట్కంబు నవలద్రోలి, యహంకార మమకారములకు జోటీయక యేకదీక్షతో, ఫలములు భక్షించుచు కొన్నినాళ్ళును, వాని విసర్జించి యాకలములు మెసవుచు కొన్నినాళ్ళును, శుద్ధ జలమునుమాత్రమే గ్రోలుచు కొన్నినాళ్ళును, వాయువునుబీల్చుచు కొన్నినాళ్ళును, నన్నియు విసర్జించి లంబికా యోగమున గొన్నినాళ్ళును నిట్లన్నియో హాయనంబు లుగ్రతపం బొనర్చినను శంకరుడు ప్రత్యక్షముగాక పోవుటచే విసిగి "పరమేశ్వరునకు నాసేవలు నచ్చియుండలేదు. ఇంకను మహోగ్ర తపమొనర్చెదగాక" యని నిర్ణయించుకొని యెన్నియో కట్టడి నియమముల దపంబాచరించినను, మహేశ్వరుండు ప్రసన్నుండు కాడయ్యె. అంతట యోగాగ్నిని రగుల్కొల్పి యందు దుముక నుద్యుక్తుండైయుండ, భక్త పరాధీనుఁడగు భగవంతుఁడు

సీ॥ తలనున్న నెలవంక మిలమిల మెరయుగ
చిరునవ్వు వెన్నెల జిందుచుండ
నెత్తిన మిసువాక జొత్తిలి చూచుచు
చూపుల సవతిని జూచుచుండ
సడలిన జుట్టున పాములాడుచు మణిధగ
ధగిత కాంతిచ్ఛటల్ దాల్చుచుండ
గాఁగలించిన దేవి గళహార, మణిరుచుల్
తళతళకాంతుల తళుకుతళుక్కునఁ [illegible]
తే॥ తోలు మొలఁ జుట్టి, శూలము గేలబట్టి
బూది మైనద్ది సం[illegible] భోంభోమ్మనంగ
నద్దునెక్కి శిలాద మునీంద్రు ప్రేమల
సాక్షి గణపతి తండ్రి సాక్షాత్కరించె.

మందస్మిత వదనారవిందుఁడై ప్రత్యక్షమైన పరమేశ్వరుని దివ్యమంగళ విగ్రహమును గన్నుల కరువుదీర గాంచుచు, నానందాతిరేకమున నేను పరవశ మొంద పరమేశ్వరుని [illegible] బొగడ నొడఁగె.

కం॥ సర్వామర పరిపాలా!
పర్వత తనయావిలోల పాపాభీలా
నిర్వాసిత మునిజాలా
నిర్వాణప్రద గణేశ నిఖిలాధారా.

అనుచు పునః ప్రణామంబు లాచరించుచు, సాగిలపడి లేవకయున్న భక్తుని భుజంబులంబట్టి లేవదీసి "శిలాదమహర్షీ!

నీతపంబున మమ్ము మెప్పించితివి. నీ వెట్టివరం బభిలషించినను గాదనక నొసగెద; వేఁడుమా” యన్న నుప్పొంగుచు, దేవాదిదేవా! దీనమందారా! నీవట్టి మహనీయమూర్తివనియే నీపాదముఁ బట్టితిని. కల్పతరువు నాశ్రయించిన వారికి కామ్యములు తీరకుండునా! దయాసింధో! భోలాశంకరా!

ఉ॥ సంతతిలేనివారలకు సద్గతిలేదను ట్టులుండ దు
శ్చింతల కాలవాలమయి చిత్తము తత్తరమందు సంటిలో
కాంతియునున్న శోభనముకల్గదు కావున దేవదేవ నీ
యంతటివారి నిర్భరమహాత్ముల సూనుల నీయవే కృపన్”

అని వినయ వినమితగాత్రుండై వేఁడిన నప్పరమశివుఁడు సంతసించి! “నీవాంఛ సిద్ధించుగాక”యని యానతిచ్చియంతర్హితుఁ డయ్యె. ఋషియు గృహంబునకరిగె. శిలాదమునీంద్రుభార్య గర్భమ్ముధరించి పదియవమాసమున నొక శుభదినంబున, సల్లగ్నమునఁ గవల పుత్రులగాంచెను. శిలాదమహర్షియు నపరిమితానందమునొంది బాలురకు జాతకర్మాదులొనరిచి, పెద్దవానికి పర్వతుఁడనియు, రెండవవానికి నందికేశ్వరుఁడనియు పేరులుబెట్టె. అబ్బాలకు లిర్వురు శుక్లపక్ష శశాంకునివలె దినదిన ప్రవర్థమానులగుచుండిరి. బాలుర కైదవయేట నౌపనయాదు లొనరించి, తగు విద్యాగురువులకడ నక్షరాభ్యాసము చేయించి, జదివించుచుండె. ఇరువురు కుమారులు నొకరినిమించి మరియొకరు మిక్కిలి శ్రద్ధమెయిఁబఠించుచు ననతికాలములోనే సకల విద్యా పారంగతులైరి. బాలురు, యుక్తవయస్కులైనఁజూచి శిలాద

మహర్షి, తన జ్యేష్ఠకుమారుండగు బర్వతునకు వివాహంబొన రింప సంకల్పించి తగు కన్యారత్నము నొక మునిబాలికను నేమించి, కుమారుంగని "నాయనా! లేక లేక చిరకాలమునకు మాయిరువురంగాంచు పుణ్యము సాంబసదాశివుని అనుగ్రహము వలన గలిగె. మీరిపుడు వివాహోచిత వయస్కులరైతిరి. నీకు వివాహమునొనర్చి సంతోషించవలయునని నామానసం బువ్విళ్ళూరు చున్నయది. అనురూప కన్యారత్నము నొకదానిని నీకై నియమించియున్నాను. నాకన్నుల పండువుగ గృహస్థువై నాయభీష్టము నెరవేర్పు"మని జెప్పిన తండ్రితో పర్వతకుమారు డిట్లనియె. "తండ్రీ! గురువుల యాజ్ఞాపరిపాలనమునకన్న నవశ్యాచరణీయమగు కార్యముమరొండు లేదనుట తథ్యమేయగు; గాని యివ్విషయమున మాత్రము నా మానస మన్యథాత్వమును సూచించుచున్నయది. నశ్వరమైన ప్రపంచ వాసనలకు సాధ్యమగు సంతదూరముననుండ వాంఛించుబుద్ధి యిందు కేమాత్రము నిష్టపడుట లేదు. క్షమింపవే"యన్న కుమారుని లాలించుచు. "నాయనా! నీ యభిలాషయంతగా ప్రశంసించ దగినదిగాదు. ఏ వయసున నేవిధముగ ప్రవర్తింపదగు నట్లుండుటయే ధర్మము. నీవిపుడు సంప్రాప్తవయస్కుడవగు గృహస్థుడవగుట పాడియగు. వివాహ మొనరించుకొనక బ్రహ్మచర్యమునొనర్చుట మంచి యూహయేయయ్యును దానిని నెరవేర్చుకొనుట గడుంగడు కష్టము. బాలుడవగుటచే నీవందలి కష్టసుఖముల నాలోచింపలేవు. నామాటవిని, యేయానందము ననుభవించ నెంచి నేను మిమ్ము బడసితినో, యా నా యాశయమును దీర్చుము. ఆశ్రమ

చతుష్టయమునందు, గృహస్థాశ్రమమునకే యగ్రస్థానమని తలంపుము. అతిథ్యభ్యాగతుల శాస్త్రోక్తముగ నర్చించుట, ప్రాజాపత్యమునొంది ఋణత్రయముల తీర్చుకొనుట, యిత్యాదులా యాశ్రమము వలని ఫలములు కావున నీపీమతము మానుమ”ని చెల్పిన పర్వతకుమారుడు “తండ్రీ! క్షమింపుడు.

కం॥ సంసారము నిస్సారము
సంసారఘోరదుఃఖ సాగరమవని౯
సంసారము పాపాంబుధి
సంసారము బందుకట్టు సౌఖ్యవితతికి౯॥

మీరెంతగా చెల్పుచున్నను నాచిత్త మన్యాయత్తముగుట నందులకు సమ్మతింపజాలదు. అవిచ్ఛిన్న తైలధారవోలె సర్వకాల సర్వావస్థలయందు నా పరమేశ్వరు నర్చనా విధానమును అహర్నిశ కామించుచున్న మానసమితరముల నభిలషింపలేదు. పసంబులకరిగి, నేనా పరమశివునిగూర్చి తపంబొనరించు కుతూహలము మిక్కుటమగుచున్నది కావున నన్ను క్షమించ యానతీయవే”యన్న నక్కజపడుచు శిలాదుడు“నాయనా!ముక్కుపచ్చలారని నీవెడ, కష్టాతికష్టమును, కేవలదుస్సాధమునగు తపఃప్రక్రియయెక్కడ, నీ సద్వాంఛ యెంతయు ప్రశంసనీయమే కాని సమయస్ఫూర్తిగాగాక, నకాలమున నిట్టి కోర్కెగల్గుట విచారణీయము. బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యంబులను అవస్థాచతుష్టయమునందును, తురీయావస్థయగు, వృద్ధాప్యమే, యందుకు తగిన యదనుగాని బాల్యమునధిగమించి యౌవనావ

స్థను జెందియున్న నీవందుకు తగెదవా? యోచింపుము" అనిన పర్వతకుమారుం డిట్లనియె. "జనకా! సర్వజ్ఞులుమీరే యిట్లన్న నేనేమందును. పరమేశ్వరార్చనకు వయోనిర్ణయము కలదా? బాల్యమున తపంబొనరింపరాదా? అట్టిఘోరనిష్ఠల నవలంభించి పరమేశ్వరుమెప్పించి నిర్వాణపథము జెందిన మహానీయులు లేరా?

సీ॥ నారదు బోధనాసారముఁ గర్భస్థ
శిశువు, ప్రహ్లాదుడే, స్థితి గ్రహించె?
నెనిమిదేండ్లైన నిండనివాఁడు, సనకస
నందను, లెటు హరిజెందగలిగి?
నైదేండ్లవాఁడౌ, హరి గొల్చి ధృవుడెట్లు
నస్వదుర్లభ పదమందగలిగె?
షోడశాబ్దంబులవాఁడు మార్కండేయు
డెట్లీశుఁగొల్చి జయించె మృతిని?
గీ॥ వయసుతో పనియేమి? యెవ్వారికైన
ప్రాక్తనార్జిత పుణ్యము పక్వమైన
భక్తివైరాగ్యములు స్వయంప్రాప్తమగును
ముక్తిఘటియించుఁ దెగిపోవు మోహలతలు.

తండ్రీ మీరెఱుంగని ధర్మములులేవు.

గీ॥ పూవుపుట్టినతోడనే, తావి దాని
నలముకొనియుండుపోల్కి విజ్ఞులుజనించు
నప్పుడె, ప్రచ్ఛన్నరూపమై యవతరించు
భక్తియనువెల్గు ఛాయానువర్తియౌచు॥

ఏబుద్ధియేగాని, దైవప్రేరితమున నేకల్గు చుండుగాని, బల నంతమున దెచ్చుకోలు చేతరాలేదు. రాదు. రాబోదు. కర్మ సంచితమే యిట్టివాటికిపాదు.

ఉ॥ జీవుల కర్మసంచితముచే, ననుగుణ్య ఫలాఫలంబు ల
బ్భావములందు గాలపరిపక్వవిధంబున గల్గు, వద్దసం
బోవు, ఫలాఫలంబు లనుభోగ్యముగా; శివునాజ్ఞలేక యే
జీవియు నెట్టికృత్యమును జేయదలంపదు, జేయదెయ్యెడన్॥

అంతేకాక

మ॥ ఒకజన్మంబునఁ బాదుఁగొన్నకృషి, రెండో పుట్టువం, దొకిం
చుక, రూపొందు, దృతీయ జన్మమున బైచోటుకు—, నిత్య
విధాయకమై, జన్మలనేకముల్గడున బక్వావస్థ ప్రాప్తించి, త
త్పక్వ, విధ్యుక్తఫలంబు దానొసగు, దైవప్రేరితం బిట్టుగా॥

మీరెఱుంగని ధర్మములు కావు. మీకు బోధింపగల యోగ్యతయు గలవాడనుగాను. మీరే పర్యాలోచించి, కర్తవ్యము నిర్ణయింపుడు."

ఇవ్విధమున బల్కు పర్వతకుమారుని సచ్ఛిజ్ఞానమున కెంతయు నలరి మారుబల్కుట కొకింత యాలోచించి, తన మానసము నలమియున్న వ్యామోహము సహించుకొనజాలక, శిలాదు డిట్లనియె.

"కుమారా! నీ పల్కులన్నియు నిక్కమములే. కాని నాయనా! సంసారమున నుండియే, ఇట్టి మహాత్కార్యములు నెరవేర్పనగుగదా? సంసారమును గర్హించుటయు సంతయుత్తమ మార్గము కాదు. నిక్కముగా సంసారము నరక ప్రాయమైనచో సృష్టియే లేకపోవలయునుగదా? సృష్టి లేనినాడు, స్థితి లయముల కవకాశమేది? ఇంక దైవమేమి? పరమేశ్వరుడెవ్వరు? భ్రాంతుడవై సంసారము నేహ్యముగా దలంచుచున్నావు. బురద యందే వసించు కుమ్మరిపురువు, తత్పంకము నంటక సంచరించు రీతి, విజ్ఞుడు సంసారవర్తియై యుండియు, తద్వాసనల నధఃకరించి మెలంగరాదా? అట్లు ప్రవర్తిల్లుచుఁదరించిన మహనీయులు లేరా? ఎందరెందరు మహాత్ములు గృహస్థాశ్రమము పరమ పవిత్రమైనదని భావించియుండలేదు. ఆలోచింపుము. సృష్టి, స్థితి, లయకర్తలగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సైతము గృహస్థ ధర్మములు నెరవేర్చుచుండుట లేదా?

సీ॥ సారహీన సంసారము సారవంత
మతివయే చేయునని, వక్షమందునిల్పె
లచ్చినాహరి, వామార్ధ మిచ్చె నుమకు
శివుడు, బ్రహ్మ వాణినిదాల్చె జిహ్వయందు ॥

అట్టివారే యాదరించిన యాశ్రమము నింత చులకన జేయుట ధర్మముకాదు. పర్యాలోచించి, కార్యమునకు గడంగుము. నే జెప్పదగినంతవరకు పైని జెప్పితిని; నీ ఇష్టమ"నిన "పర్వతుడునగుచు జనకా! ఏకత్వముస్థాపించు పరిశుద్ధ నిర్గుణ

తత్త్వమునుండి యావిర్భవించిన సత్వ, రజ, స్తమములకు నధీశ్వరులై, త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతోనా! మనకుపోటి? ఆదిమధ్యాన్త రహితులు, బ్రహ్మాండ నాయకులు, సనాతనులునగు మహాపురుషులతో మనము పోల్చుకొనుట, నక్క నాకలోకము నధిగమించుటయగు. వారి కనుష్ఠేయము లగు కార్యములు మనకు సాధ్యములా? క్షీరోదధినుండి వెడలిన హాలాహలమును గుటగుట గ్రోలినవాడు ఫాలాక్షుడు. కురియు రాళ్ళవాననుండి భక్తుల తప్పించుటకు గొడుగువోలె గోవర్ధన పర్వతము నెత్తిన మహనీయుడు గోపాల కృష్ణుడు, బ్రహ్మాండ భాండముల నన్నిట సంకల్ప మాత్రమున సృష్టించుమూర్తి బ్రహ్మదేవుడు అట్టి మహాత్కార్యము లాచరించుట మనకు సాధ్యమా? తండ్రి తమ యాజ్ఞల పాలింపలేదని నాపై నలుగక నన్ను క్షమింపుడు. మీరెన్నివిధముల జెప్పి నన్నొప్పించ నెంచి నను, నాహృదయము విముఖముగనేయున్నది. దానిని మార్చు కొనుశక్తి నాలో లేదు. ఈశ్వరార్పణముగ నా యీదేహ, మానప్రాణము లర్పించి, లోకకళ్యాణార్థము యత్నింపదలచు నన్ను నాయుద్యమము నుండి మరలింప యోజింపక యనుమతి నిచ్చి తపోవనంబుల కనుపుడు. శాశ్వత సద్యశశ్చంద్రికల దిక్కుల వెదజల్లుడు. ఇదియే నా వాంఛ.

సీ॥ శివభజనామృత సేవకై తపియించు
నాల్క వాకొనునె స్త్రీ నామమెందు
పరమేశునర్చింప బరుగువారెదు, చేతు
లాడునే సయ్యాట లతివతోడ

గళ్యాణసాంబుని గాంచ నువ్విళులూరు
కన్నులు చూచునే కామినులను
శ్రవణపేయంబైన శివకథాశ్రుతిగోరు
చెవు లాలకించునే స్త్రీలపలుకు

గీ॥ లహరహంబేకధారగా హరహరయని
జపముసేయుచు మ త్తిలి సాంబశివుని
మూ ర్తి తనలో ప్రతిష్ఠించి మురియుచున్న
హృదయ మెలనాగలకు స్థానమీయగలదె ॥

కాబట్టి తండ్రీ నేనీవిషయమున కేమాత్రముందగియుండను. నన్ననుగ్రహించి, యాశీర్వదించి తపోవనంబుల కనుపుడని దీనాతి దీనముగ వేడుచున్న కన్నకుమారుని దృఢసంకల్పమునకు మెచ్చుకొని, దక్షిణహస్తంబు, వానియొాదలనుంచి, కుమారా! నీభక్తి జ్ఞానవైరాగ్యములు ఫలించుగాక. పోయిరమ్ము. ఇష్ట కామ్యార్థసిద్ధిరస్తు ఈశ్వరప్రసాద ఫలప్రాప్తిరస్తు అని దీవించె.

పర్వతకుమారుడట్లు తండ్రిచే ననుజ్ఞాతుండై మహారణ్యాంగులకుంజని యొక పవిత్ర స్థలమున దపమొనర్ప నుపక్రమించె. ఏకపాదాంగుష్ఠుడై నిలిచి ఘోరతపము సాగించుచుండె ఈశ్వరానుగ్రహము రాకపోవుటచే నంతకన్న యుగ్రముగ సలుప యోచించి యూర్ధ్వబాహుడై నిల్చి వాయువు నాధారాది చక్రంబుల నిల్పి పరమేశ్వరునిపై బుద్ధి లయింపచేసి తపంబొనర్చె. అంతకును పరమేశ్వరుడు ప్రత్యక్షంబు గాకపోవుటకు వగచి పంచాగ్ని మధ్యమున నేలకు తలమోటించి,

యూర్ధ్వరేతస్కుడై, యనిమిష నయనంబులతో సూర్యు నవలోకించుచు నుగ్రాత్యుగ్రతపంబొనర్చినను మృకండునకు దయ రాకపోవుటచే నొచ్చి, ఈశ్వరా నీదయ ఇంతటిదేనా. ఇంత నన్ను శోధించిన నేనోర్వగలనా? ఇక నాగతియేమి. తండ్రి యెంతిగా చెప్పినను వినక వచ్చినందులకు తోడుగ జగత్పితవైన నీ దయకును దూరుడనైతినే. భక్తరక్షణ దీక్షాపరుడవని భ్రమసి ఇంతవరకు శ్రమించితిని అని యోచించి అగుగాక నేనే ప్రమాదపడితి. నీకష్టములే నీకుండ, యిక నన్ను నీవు రక్షింపగలవా? నీ సంసారమే నీవు మోయలేకుండుటకు నాబోటివారి భారము సైతము నీకెందులకు? అని విసుగున స్తుతింపసాగెను.

సీ॥ అర్ధదేహముగొన్న యతివయొక్కతె, సతి
పై శివాలాడెడు, భార్యయొకతె
కుడుములు, చెడతిను, కొడుకొక్కడు పులింద
కన్యతో గులికెడు ఘనుడొకండు
శుష్కపిప్పియాలతో క్షుధదీర్చు, మిత్రుడు
కోరివిదయ్యాలు నీ పరిజనములు,
యిట్లైనయున్నదా? వల్లకాడేకాక
నిడుపు భిక్షాపాత్రి నెత్తిపుఱ్ఱె
గీ॥ బుస్సు, కస్సనుపాములు భూషణములు
తోలు మొలగుడ్డ, ముసలెద్దు తురగమిట్టి
కష్టజీవివి నీవేడ? కాళ్లబడ్డ
నన్ను రక్షించుటేడ? పినాకహా

సీ॥ తినమెతుకు లేక, భిక్షమెత్తెడు బికారి
వీవు, నిను నమ్ముకొన్న నాకేమియొసవు?
జోగి జోగి కరుచుకున్నచో, లభించు
బూడిదకదా? యుదేమన పోల్కి-యయ్యె ॥

శా॥ నీవే దేవుడవన్న మాటవిని కానీ చూతమం చిన్ని నా ।
శ్లేవేవో యడియాసలంగొనియు నాయీదేహముం బుద్ధి నీ
కై వెచ్చించితి, మోసపోయితిని, వ్యర్థాపేక్షచే నింటికిఁ
బోవంజాల భరింపజాల నసువుల్ భో! పార్వతీవల్లభా ॥

అని యిట్లు విసుగున, నీశ్వరు దూలనాడుచు కొంత నడికి తెప్పరిల్లి నా ప్రాప్తమిట్టులుండ నీవేమిచేయఁగలవు. కానీ యేమికానున్నదో

కం॥ నిందాస్తుతిఁ జేసితినని
కుందింపకునన్ను, నొక్క- కూరకోడనే
విందు రుచింపదు, చేదు బ
సందగు, నగు మధ్యమధ్య శాంభవినాథా !

ఇక నీదయ యేమిచేసిననుసరియే, యని నిశ్చేష్టుడై బడి యుండె. అంత దీనదయాళుఁడైన పరమేశ్వరుఁడు.

మ॥ తలపై పుష్కరగంగ, కౌగిటను మాతాదేవి, రుద్రాక్షమా,
లలు వక్షంబున, నేనజర్మమును, హాలాహలచిహ్నంబులా

- గళమునందుండన్ హారికంకణంబులు, ఫణిగ్రైవేయకంబొప్పగా,
వెలసెన్, బర్వతు మ్రోల, శూలధరుఁడై, విశ్వేశ్వరుం డంతటన్॥

అట్లు కన్పించిన మంగళాంగుని కన్నుల కరువుదీర గాంచుచు, పెన్నిధిగన్న పేదపగిది నుప్పొంగుచు, పరమేశ్వరు ధ్యానముజేయ దొడంగె.

కం॥ రుద్రాక్ష మాలికాధర!
భద్రశ్రీ భస్మలిప్త పావన దేహా!
రుద్రా! పినాకహస్తా!
విద్రావిత శత్రుపక్ష! విమతధ్వంసీ!

అని సాష్టాంగ నమస్కారమొసర్చి లేవకయున్న భక్తుని భుజములుబట్టి లేపుచు పరమేశ్వరుఁడు. వత్సా, పర్వతకుమారా! అనన్యదుర్లభమగు, నీ తపోయోగమునకు మెచ్చితి. నీ కేమి వరములు కావలయును కోరుకొమ్మనిన పర్వతుఁడు తండ్రీ, పరమ కరుణాసముద్రుఁడవగు నిన్ను దూలనాడిన దుష్టుడను. కల్పభూరుహ మింటగలవానికి కాజాలని కామ్యము లుండనట్లు, మేరుపర్వతమునందుండు వానికి కనకమునకు కొదువ లేనట్లు, ఆశ్రిత పారిజాతము నండనున్న నాకేమికొదువ. అత్యాతురతచే నిను నిందించిన నామానస మాందోళనఁ బడుచున్నయది. తండ్రీ రక్షింపుమని పదయుగ్మముపై నొరిగిన భక్తునిగాంచి, భక్తా చింతింపకుము. నిందయందును నీవు నిజమే పల్కితివి.

కం॥ అన్ని నిజమే పల్కితి
వన్నా నిందించితంచు నడలకు మదిలో

నన్నిటికన్నను, తుదిస్తుతి
నన్ను న్మెప్పించె భూషణ ప్రాయముగన్ ॥

ఇందు నీవు భీతినందదగిన దేమియు లేదు.

కం॥ కొందరు నిందాస్తుతులచె
గొందరు భక్త్యనుపమానగోష్ఠి సలుపుచున్
గొందఱు మిత్రత్వంబున
గొందఱు శాత్రవము నొంది గొల్తురునన్నున్ ॥

నేనందరను, సమానముగ నాదరింతును. అంతేకాక నీవన్నవిషయముల యందలి యాంతర్యమును గుర్తింపనేరక నేనంటిని. విను మా రహస్యములను జెప్పె,

సీ॥ సృష్టికి మూలమే స్త్రీయని రూపింప
నెత్తిపై గంగను నిలిపినాను
బురుషు దేహార్ధమె పొలతినా బ్రకటింప
బ్రియకు వామార్ధ మర్పించినాను
సర్వ సమత్వంబుఁజాటు, బోయెతగూర్చి
షన్ముఖునకు పెండ్లి సలిపినాను
అతి నికృష్టులకైన, నాశ్రయుడితఁడన
బ్రాచుపాముల మెడఁదాల్చినాను
గీ॥ భక్తిమస్తిష్కముల జేర్పబడఁదగుననిని
షుజాచే బి.క.మె తగా బూనుకొంటి

లోకకళ్యాణ కృషికి నేనైకలక్ష్య
మని నిరూపింప నెద్దువాహనముగంటివి॥

సీ॥ ఏనాటికైన నిదేకాని, యదికాదు
నాదెల్ప వల్లకాటన్వసింతు
దృశ్యప్రపంచం బనశ్యంబుగా నశ్య
మానని బూదిమై నలదికొందు
సృష్టిలో వస్తువెద్దేని భోగ్యంబని
విషపానవిధమున వెల్లరింతె
కామదాస్యము కొరగాదని బోధింప
మన్మథు నిజరూపు మాపినాను
గీ॥ స్వార్థమున కన్యథనము వివర్జితమని
తెలుప మిత్రునిసాయ మర్థింపకుండు
లోకకంటకుల విధించుజోక, భూత
ములను శాసింతు నిదియె మత్పూతవృత్తి

కావున వత్సా నీవు భయమునందక నీవాంఛల నర్థింపు మన్న పర్వతకుమారు డానందాతిరేకమున తండ్రి ఉద్ధరింప బడితిని. నా వాంఛల మనవిచేసుకొందును.

సీ॥ భరతఖండంబున, బర్వతాకృతిబొంది,
నేను శాశ్వతముగ, నిలుచునట్లు,
నాపైని మేర్వాదినగములు, ప్రముఖ తీ
ర్థములు, ముప్పదిమూడుకోటి యమరులుండ,

నీవు మాదేవితో, నిఖిలప్రమథగణం
బులుగొల్వ, వేంచేయవలయునందు
బర్వతేశ్వరుడనబడుచు, చాతుర్వర్ణ
జులపూజ సమముగా జూడవలయు
సీ॥ నాశిరంబైన శిఖరము, నరులెకాక
ఖగమృగంబులు నైతము గాంచునెడల
ముక్తిసామ్రాజ్య మొసగుచు, బ్రోవవలయు
నివియె నా వాంఛలగును సర్వేశ ! యీశ॥

ఇక మీదయు, యేమిచేసినను సరియె. అని దెల్పు భక్తునితో భోలాశంకరుడు వత్సా నీకోర్కెలసాధారణములు. అనేక భక్తుల గాంచితిగాని నీవంటి పరోపకార పారీణుడగు పరమభాగవతోత్తము జూడలేదు. మేలు మేలు ప్రపంచోద్ధరణమునకై నీవడిగిన యర్థంబులన్నియు, కేవల ప్రశంసాపాత్రములు. నీ యభీష్టములన్నియు నెరవేరుగాకయని సాంబశివు డదృశ్యుండయ్యె.

అంత పర్వతకుమారుడు మానవాకృతినివిడనాడి పర్వతరూపమును ధరియించె ఆమహానుభావుని శిరమే శిఖరమనబడు. శ్రీకంఠుడు, కాత్యాయనిదేవితోడ నప్పర్వతంబున నెలవుకొనియె. ప్రమథులు, వారివారి స్థానములయందు వారువారు నెలకొని పరమేశ్వరు గొల్చుచుండిరి. నాగకంకణునాజ్ఞచే ముప్పదిమూడుకోట్ల దేవతలగ్గిరియంతా వాసమేర్పరచుకొనిరి. సకలపుణ్యతీర్థము లగ్గిరిరాజము నాశ్రయించె. లోక కళ్యాణము

కొరకై పర్వతునిమూలమున బరమేశ్వరుడు పర్వత క్షేత్రమును ప్రపంచముననిల్పి భక్తుల వాంఛల దీర్చుచుండె.

ఇట్లు కొంతకాలము గడువ శిలాదమునీంద్రుని రెండవ కుమారుడగు నందికేశ్వరుడు, తండ్రిని సమీపించి వినయ వినమితాంగుడై చేతులుజోడించి యిట్లనియె.

ఉ॥ ఎన్ని దినంబు లిట్లయిన నేమి ఫలంబగు? పూరుషార్థమా?
పున్నెమ? పుట్టలోచదలు పుట్టద, గిట్టద, యూరుపేరులే
మున్నవి వ్యర్థమానవుల కుగ్రునిగూర్చి తపంబొనర్చి మా
యన్న విధాన నేనును మహార్థములొందదలంతు నయ్యరో!

నన్ను నాశీర్వదించి తపోవనంబుల కనుపుమనిన నంది కేశ్వరు వాక్యములు, మానసమునొక్కింత గలవరపెట్టుచున్నను ననివార్యములుగా మనంబున జింతించి, కానిమ్ము దైవేచ్ఛ యిట్లున్నది.

సీ॥ ఈశ్వరానుగ్రహమున జనియించినట్టి
సుతుల నిర్వుర నీశ్వరాంకిత మొనర్చి
ధన్యులలో, నొదు నేనెబో, ధన్యతముడ
ననుచు నూరటజెంది యిట్లనియె నతడు॥

కుమారా!

మ॥ నిజవంశానుగత ప్రమేయమగుటన్ నీకిట్టి సద్బుద్ధి య
గ్గజచర్మాంబరు పేర్మిమై కలిగె నీకంబోదు గౌరీశు డ

క్కజ మందం, దపమాచరించియు జగత్కళ్యాణకార్యార్థమై
సుజనుల్మెచ్చెడు శ్రీభవబొమ్మడుగు మిాకుండిచ్చు నీ
యర్థముల్॥

నాయనా సుఖముగా బోయిరమ్మని యాశీర్వదించి
పంపిన, నందికేశ్వరుడు పర్వతంబునకుంబోయి, వర్షాతాపంబుల
లెక్కింపక, శీతాతపములకు వెరువక అన్నపాన వివర్జితుడై,
యనేక హాయనంబులా హారుంగూర్చి తపంబాచరింప . ఉమా
కళత్రుడు మెచ్చి.

సీ॥ ప్రమదులెల్లరుచుట్టును బలిసికొలువ
నద్దునెక్కి, త్రిశూలంబు నెసగబట్టి
నెడమపార్శ్వము స్త్రీ మూర్తి, కుడి పురుషుడు
గాగ ప్రత్యక్షమయ్యె శ్రీకంఠుడపుడు.

అత్తరి నందికేశ్వరుడా మూర్తినిగాంచి యపరిమితానం
దమున

కం॥ లాలిత దిక్చేలా, సుర
పాలా! దళితారివీరబాల! భవానీ
లోలా! దుర్మద మదనా
భీలా! కరధృతకపాల; భీమ! నమస్తే॥

అని వినుతించిన, కృత్తివాసుడు మెచ్చుచు నాయనా!
నందీ! నీకాలమున నందరు నట్టివారే నీయగ్రజుని వ్యాజంబున

గాదె పర్వతేశ్వర నామంబున నిందుండుట. ఈపర్వతరూపధారియే మీ యన్న. లోకోపకారార్థమై మమ్మిటకు రావించి యున్నాడు. ఇంక నీ వాంఛితము లెట్టివో యెఱింగింపుమనిన నందికేశ్వరుం డలరుచు.

సీ॥ నేను నీసన్నిధానమందే సతంబు
నిల్చునట్లు, వాహనముగా నినుభరించు
నట్లు, ప్రమదాధి పత్యము నందునట్టు
లేలుకోగదవయ్య సర్వేశనన్ను॥

నిన్ను విడచి యొక గడియయేనియు నే నిలువనోపను. నేటినుండియు నీకు నందివాహనుడను ప్రసిద్ధనామము వర్తించు గాక, యన్న నట్లేయగునని, శివుడంతర్హితుడయ్యె.

అక్కారణంబున బంచవక్త్రునకు నంది వాహనము లభియించె. నందీశ్వరుడు పరమేశ్వరు వాహనమగు, వృషభరూపమును బొంది పర్వతమున నెలకొనియె.

పిదప కొంతకాలమునకు సుమతియను మునీశ్వరు కుమార్తె శ్రీ యనుకన్య పరమేశ్వరు గూర్చి దివ్యతపంబుజేసి మెప్పించిన ఫాలాక్షుడు సాక్షాత్కరించి, యేమికావలయు నన్న నామె

కం॥ శ్రీయను నా నామంబును
నీ యాలయమైన గిరికి నిల్పుము మొదలన్

నా యభిమత మదియే
కాయజ విధ్వంసి! తీర్పగావలెనన్నన్ ॥

నాపేరు ప్రపంచమున శాశ్వతముగా నిలుచునట్లీవరంబు ప్రసాదింపవే యనిన నట్లేయగు గాతమని శివుడంతర్ధానము నొందె. శ్రీ యనుకన్య కనుగ్రహించిన గుర్తుగ శ్రీ శబ్దమును పర్వతము ననుగ్రహించిన చందము దోప, పర్వత శబ్దమును శిలాదు ననుగ్రహించిన కారణమున శైలశబ్దమును నగ్గిరికి, శ్రీశైలపర్వతమనియు, శ్రీపర్వతమనియు, శ్రీ శైలమనియు పేరుకలిగె.

ఓమ్.

# శ్రీ శైలేశ చరితము.



పూర్వకాలమున శ్రీనగమున కుత్తరదిశయందు మల్లికాపురమను పేరంబరగు నొక మహాపట్టణము కలదు. సుప్రసిద్ధమైన యాపట్టణము రాజధానిగఁ జేసికొని చంద్రగుప్తుడను రాజు పరిపాలన చేయుచుండెను. అతని రాష్ట్రము సర్వసంపదల కాలవాలమై ధర్మదేవత సర్వదా విహరించుచుండు. అధర్మ పరివర్తకులకు, ససత్యవాదులకు, కులపాంసకులకు, నాతని రాష్ట్రమున స్థానమే లేదు. అజాతశత్రువువలె జగజ్జేగీయమానమగు కీర్తినవహించి, యష్టయిశ్వర్య సంపన్నుండై, నిత్యము త్రికాలములయందు నీమము తప్పక శివార్చన మొనర్చుచు, సుఖముగాఁ గాలము బుచ్చుచుండె.

అతని కర్ధాంగలక్ష్మియైన, విమలాదేవి యను రమణీమణి, యన్నివిషయములయందును ఛాయవలె భర్త ననుసరించుచు, పరమసాధ్వీతిలకమను సద్యశముగాంచి, సమస్త భోగముల ననుభవించుచు నలరారుచుండె. ఇట్లాదంపతులు పెద్దకాలము, కుబేర సంపదలమించు, నైశ్వర్యము నొంది, దాసదాసీజనంబులు తమ్ము బరివేష్టించి, సమస్త రాజోపచారములు సల్పుచుండ, బరమేశ్వరారాధనా తత్పరులై సుఖముగనుండిరి.

అట్లు సర్వసుఖముల ననుభవించుచు నానందము జూఱ గొనుచున్నను, వారి హృదయములలో వ్యామోహ విషబీజ మంకురింపకపోలేదు. ఐశ్వర్యము లెంతగానున్నను, భోగము లకు కొరతరవంత లేకున్నను, దిగంత విశ్రాంతమైన యశశ్చంద్రి కలు, తమ్ములముచున్నను, నపుత్రికులగు, వారి హృదయముల కూఱటగలుగలేదు. అంకురితమైన బీజము, మొలకయై, చెట్టయి తుదకు మ్రాకై, పుష్పఫలంబుల నీదొడగె, భోజనార్హములు కాని, విషఫలము లెంతకాలము, భుజింపగలరు. పాపమా పవిత్రదంపతు లిట్టి యావేదనచేఁ గడుంగడు నొచ్చి, సేయునది లేక తమ్ముదామే యోదార్చుకొనుచు మరి కొంతకాలము గడిపిరి. పురుషులయందుకన్న స్త్రీలయందే సహన స్వభావమెక్కు వగనున్నను నద్దాని గుప్తపరచుటలో పురుషులే కృతహస్తులనుట నిర్వివాదము. పుత్రవ్యామోహ మంతకంతకు మిక్కుటమై, పొంగి పొరలిపోవుచుండ విమలాదేవి భరింపలేక, జీవితేశ్వరుం జేరి, ప్రణమిల్లి, యాతని యానతిమై, సుఖాసీనయై, యిట్లని చెప్పదొడగె. నాథా! మిక్కుటమైన, దుఃఖము భరింపజాల కేల నా యీ వ్యర్థజీవితము.

ఉ॥ ఎంతటి భాగ్యముల్ గలుగనేమి? మహోజ్జ్వలమై, దిగంత వి
శ్రాంత యశఃప్రభావములు సమ్మతిఁ గ్రమ్మిన నేమి? చిత్తమా
నంతయు, జింతపీడదు, గృహంబున కాంతియు సౌఖ్యమేల యీ
సంతతి లేనిజన్మ, మనుజాలను నేనిల గొడ్డురాలనై॥

ప్రాణేశ్వరా దుర్భరము. దుర్భరము. ఈ జన్మము నాకు మాతృత్వ గరిమ లేదా!

సీ॥ జలిబిలిపల్కులు, చిన్నారి పొన్నారి
కన్నవానిం జూచుకొన్న సుఖము
కేరింతఁగొట్టుచుఁ జేరవచ్చినపట్టి
గ్రుచ్చి యొమ్ముల హత్తుకొను సుఖము
సుందరముబెట్టుచో గూరిమినిండగ
నూరార్చునప్పు డొప్పారు సుఖము
ముద్దుముచ్చట్లచే గ్రొద్దుబుచ్చుచు నెట్టి
మొట్టికూనను నిద్రబుచ్చు సుఖము

గీ॥ హృదయమున బొంగి పొరలి పైకెగయుచున్న
ప్రేమతనివోక ముద్దులు పెట్టిపెట్టి
యుబుసుదీరెడు సుఖము నాకొదువదయ్యె
పారిపోసినగంజి నాపాడుబ్రతుకు॥

సీ॥ కనిపెంచు, మాతృత్వగరిమ, గాంచగలేని
స్త్రీత్వమా? యిది మొద్దుచింతకాక
లాలించి పాపను పాలీయనోచని
కుచములాయివి? వికుచములుకాక
కైజేసి పసికూనకౌగలించగలేని
కరములాయివి తెడ్డుకరలుకాక
లాలినూపుచు, బాప జోలపాడగబోని
నోరు నోరా? తోలుబూరకాక

గీ॥ కాళ్లుచేతులాడించుచు కనులుపండు
వుగ గిలారించు పసిపాప మొగముగాంచి
మురిసిపోలేని హృదయమా మొరడువారి
కడుపుగట్టిన చట్రాతి కరణిగాక॥

జీవితేశ్వరా! ఇక నేనీ దుఃఖమును భరింప జాల. సర్వదుఃఖహారుండగు, పరమేశ్వరుని మెప్పించి వరము లబడసి, చిరంజీవి నొకనిగాంచిననే నామనంబున కూరటగల్గుట. కాపున దయాపారీణులై సత్వరమజని తపంబొనర్పుడని ప్రోంద రించిన కాంతామణి పల్కులవశ్యాచరణీయములుగ దలంచి కాంతా నీయుపదేశము నన్నింతయు సలరించినది. అవశ్యముగా నేజని కృత్తివాసునిగూర్చి ఘోరతపమాచరించి, సత్సంతతిగాంచి వచ్చెద. సంతానవాంఛ నాయంతరమును, గలచుచున్నను, పురుషుడనౌటచే, నేను వెల్వరింపక లోనడంచుకొనియుంటి. ఇత్తరి నీమూలమున బయల్పడియె. నాకు ను దుర్భరమగుచున్నది.

సంతతిలేని జన్మ వ్యర్థమేననుట తథ్యము.

ఉ॥ శాంతములేని సువ్రతము, క్షాంతివహింపని చిత్తశుద్ధియుఁ
గాంతుడులేని చెల్వ రహా, కాన రహించెడు వెన్నెలల్ని శా
కాంతుడు రానిరేయి, గుణగణ్యుడుకాని కుమారకుండు స
త్సంతతిలేని వంగణము చానరొ వ్యర్థము వ్యర్థమేయగుఁ॥

ఇదే వెళ్ళెదనని, తెల్పి యామెవలన ననుజ్ఞాతుండై వనముల కరిగి, యందొక రమ్యప్రదేశంబును శుభ్రపరచుకొని చంద్రగుప్తుండు, పరమేశ్వర లీలావినోదముల గుర్తింపలేక నిట్లు

పలవింపఁదొడగె, దేవా నీలీల లనంతములు. మీ బోంట్లు గుర్తింపగలరా ?

సీ॥ పరములోభికి, బెట్టిబడి మూల్గుధనరాసు
ఔదార్యమూర్తికి బేదరికము
వలదు వద్దను వానికెలునిండు సంతతి
యలమటిల్లెడువాని కసలునున్న
తీపలేనరోగికి దివ్యమృష్టాన్నముల్
మాడువానికి పట్టి మాడుచెక్క
దంభపరిస క్తికిఁదగు పటాటోపము
శుద్ధతత్వమునకు జుక్కయెదురు

గీ॥ కూరొచ్చెను బడాయికోరుకు కుప్పలాది
పాటుపడు కష్టజీవికి బండిగాను
ధర్మమే లేదొ? న్యాయము తారసిలదొ?
యిట్టి నీలీల లేమొ నేనెఱుగజాల ॥

సృష్టియంతయు నిదేరీతి

సీ॥ పండిత ప్రవరులు పాతాళమునయుండ
మిడిమిడి చదువరి మేడలెక్క
ముక్తుడో విజ్ఞాని రిక్తుడై పడియుండ
మెట్టవేదాంతి తామింటికెగయు
సత్యనేమూలనో చచ్చినట్లాడుగుచో
కల్ల లోకమునెల్ల కలియబెట్టు

ఋజువర్తనులమాట రిత్తయై జోత్రిల
కూలంకషనిధాటి కోటగట్టు

సీ॥ ప్రకృతి తలదాచుకొనచోటు బడయుకున్న
వికృతి విజయధ్వజంబు స్థాపింపగలుగు
నేమిలీలలోయివి నీకె యెఱుకగాని
తెలుప దుస్సాధ్యమూహింప తరముగాదు ॥

మరియు:

సీ॥ పరమసాధుప్రభర్త పాపిష్టి యిల్లాలు
తండ్రిలుబ్ధుడు విశ్వదాత సుతుడు
గురుడు విజ్ఞాని ముష్కరుడు శిష్యుడును
కోడలుత్తమురాలు కొరివియత్త
యాచారసంపన్నుడన్న తమ్ముడు శుంఠ
యాశదొడ్డది చేయునలసవృత్తి
తానురిక్తుడు బుద్ధి ధరణీతలంబేలు
నాలోచనలుపెద్ద యాస్తిచిన్న

సీ॥ పండితాఖండలునిపట్టి బండమొద్దు
శుద్ధవైదికునిల్లాలు పోకులాడి
యిట్టులన్యోన్య ప్రకృతి వికృతుల నొక్క-
గాట గట్టేసి ఫలమేమి గందువయ్య॥

దీనబంధో దురూహ్యములగు నీలీలల నెంచ నేనెంత వాడ
తండ్రీ నాకోర్కెలు దయచేయుమని, తదనంతరంబు చంద్రగుప్త

మహారాజు పరమనిష్ఠాగరిష్ఠుండై పెద్దకాలం బుగ్రతపంబొనరింప భక్తవశంకరుడగు శంకరుండలరి.

తే॥ గీ॥ ద్వంద్వయుతమైన మిథ్యాప్రపంచమందు
ప్రకృతి ఈశ్వరులేకమై బరగెదరన
నెడమ భాగము స్త్రీ మూర్తి, కుడి పురుషుడు
గాగ ప్రత్యక్షమయ్యె శ్రీకంఠుడపుడు॥

వత్సా! నీతపమునకు మెచ్చితిని నీకేమి కావలయును కోరుకొనుము. అని పల్క కంశేకాలుసిగాంచి.

కం॥ శ్రీ శైలేశా! భవభయ
నాశా! కైలాసవాస! నాగవిభూషా!
ఆశాపాశవినాశా!
కాశీవిశ్వేశ! యంబికాప్రాణేశా॥

సీ॥ రోహిణీప్రియవాహా! నిర్మోహ దేహా
నాగకంకణ భస్మాంగరాగ భూష!
అంబరాంబర త్ర్యంబకా శంబరారి
ఆదిభిక్షూ శ్మశానవాసా! నమోస్తు॥

అని స్తోత్రముచేసి మహానుభావా! దేవాదిదేవా! మీరెరుగని యర్థంబులుకలవే. నీయాజ్ఞలేక చీమయేని కదల నేరదుకదా. పరాత్పరా నీదయనాప్రాప్తము అని భాషించెడు భక్తుని పల్కులాలించి శివుడు మందస్మిత వదనారవిందుడై నీ

యర్థంబు లేనెఱుంగుదు. నీ సందేహములుకూడ నేనెఱింగితిని. ఎట్లో వినుము, నీయర్థంబుల వివరించెద.

ఉ॥ తప్పుడు కాక మానవుఁడు దారికి రాడు, విపర్యయాప్తమే
తప్పునిఁ జేయుసాధనము, దానను కొంతే నిజాంతరంబు ప
ర్యాప్తినిజెంది భిన్నవిషయానుభవంబునుగోరు నంతే సం
ప్రాప్తమనోరథుండగునుపాయము నెంచు గ్రమక్రమంబుగన్

సీ॥ ఇట్లనేక జన్మంబుల నీఁగి యోగి
కొలదికొలదిగ విజ్ఞానఫలముగాంచి
పక్వమైనంత రాగవిపాకమొదవి
నన్నుఁ జేరెడు జీవుఁడో యన్న తుదకు॥

నాయనా! శాత్రవము నైజమనియు, వైకల్పికమనియు రెండువిధములు. నైజవిరోధము జన్మతోడనే బుట్టినది. నివారింపరానిది. వైకల్పికము కృత్రిమమైనది. సాధకునకు నివారింపరానిది. పిల్లి, యెలుక పీనికిగల శాత్రవము నైజమనియు, స్వజాతివిరోధము కల్పితమనియు నెఱుంగునది. పరస్పర విరోధము పరిణతిమార్గమునకు మొదటి మజిలీయగు. గమనింపుము. చీకటియందున్నవాఁడే వెలుగుమహిమము నెఱుంగును. ధనమదాంధుడు దారిద్ర్యముబాధ తెలియు లేడు. పరికింపుము. భార్య గుణవతి. భర్త నికృష్టుడు, ఈసంఘటనమునందలి పరమార్థము నుగుర్తింపుము. గుణపాఠబోధనమే యిందలి లక్ష్యము. ఎట్లన భరించునధికారిభర్త. భరింపబడదగునదిభార్య. ఆశ్రయుడు తుం

టరి. ఆశ్రితుడుత్తముడు. తనయాశ్రయముననున్న భార్యను మండగీడగుభర్త యెన్నికష్టములనో బెట్టుచుండును. కాని గుణ వంతురాలగుభార్య స్వధర్మముల బాటించుచు భర్తను శాసింప నేరదు. తనకష్టములనోర్మిచే భరించుచు మారుపల్కక యుం డును. అంతటి దృఢచిత్తురాలగు భార్య నెంతకాలము బాధింపగలడా కర్కశహృదయుడగుభర్త. కొంతకాలమునకైనను వానికి విసుగు జనింపకపోదు. ఆవిసుగనునదియే భర్తృహృదయమునందలి కర్కశత్వమును మార్పుచెందించుట కేర్పడిన మొదటి కిరణము. అయిన నక్కిరణ మేడనుండి యెట్లువచ్చె? దానినందు జేర్చినవారెవరు? అనుప్రశ్నకు ప్రత్యుత్తరముకూడఁ దెలియదగు, దృఢచిత్తురాలై కష్టములనోర్చిన భార్య నిశ్చల జ్ఞానదీపమునుండియే యక్కిరణ ముద్భవించి గాఢాంధకారావృతమైన భర్తహృదయమున తొలిసారిగ ప్రవేశింపగల్గును. ప్రవేశకుడు పరమాత్మ డేయనుట నిర్వివాదము. ఇదియే ప్రథమ గుణపాఠము. అంతటితోనే విజ్ఞానబోధ పూర్తికానేరదు. వర్ణమాల నేర్చుకొనిన విద్య పూర్తియగునా?

అట్లు ప్రవేశించిన ప్రథమ కిరణము గాఢాంధకారము నందు మిణుగురుపురుగువలె తోచితోచక తళుకుతళుక్కున మెరయుచు నంతలో మాయమగుచునుండును. తర్వాత క్రమ క్రమముగ నిట్లే మరికొన్ని పాఠములు వల్లించినగాని పరిపక్వస్థితి కలిగి జ్ఞానవిద్య పూర్ణము గానేరదు. అట్టి పరిపూర్ణజ్ఞానము కేవలప్రభావంతమై, అజ్ఞానతమసము నపహరించి విజ్ఞానము

ద్రాంకితము చేసివైచును. అయిన పైనవర్ణించిన పాఠముల న్నియు నొకేసారి వర్ణింపరాదాయన్న నదిమసాధ్యము. క్రింద నిల్చియున్నవాడు మేడపై కొక్కసారిగ లంఘింపనెంచుట నెట్లు యూహ. ప్రతిసోపానము నధిగమించిగాని మేడపై జేరలేనట్లు జీవుడుకూడ నొకొక్కపాఠ మొకొక్క జన్మలో నేర్చుకొనుచు నిట్లనేక జన్మములనెత్తి, చివరకు విజ్ఞానియై, అవినాభావసంబంధమున నాలో చేరిపోగలుగును.

ఒకజన్మలో సాధించినగుణపాఠము తరువాతి పాఠమునే రెండవపుట్టువనం దభ్యసించుట. ఇట్లే పాఠములు పూర్తి చేసుకొనవలయును. దీనికే సంచితమని పేరు. సంచితముకొరకై నొనర్పదగుకృషికే కర్మయనియు పేరు.

నాయనా! ద్వంద్వమయమైన ప్రపంచము, రెండు భిన్న ప్రకృతుల కలయికచేతనే పరిణతినొందగలదు. దానికాదర్శము నాధారము, నాధేయము నేనేయని నిరూపించు నామూర్తి నొకపరి తేరిచూడుము.

సీ॥ ఒక్కవంకఁ బ్రకృతి యువు యున్నది దాని
కుడిపార్శ్వమం దీశ్వరుడను నేను
పాములు విషము నాపై గ్రక్కుచున్నవి
మణిదీప్తు లంబపై మలయుచుండు
గంభీరసారంగ గంగ నాపైనుండు
తచ్ఛీకరవాం [illegible]

ఆచేఁ గనకపాత్ర యాచేఁ గపాలము
హేమాంబర మచట, కృత్తి యిచట
సర్వమంగళ యుమ, నేను స్థాణుమూర్తి
నిట్టు లాదర్శమూర్తి నై యెసఁగి సర్వ
జీవవితతి విముక్తుల జేయఁగోరి
ప్రకృతి వికృతుల, సంధించి పాలఁబడుదు.

అను గుణసమ్మేళనమునఁగాక భిన్న గుణ సంకలనమువల్లనే సృష్టియని యెఱుంగుము. ప్రకృతి వికృతులు అను స్త్రీ పురుషసంయోగమే సృష్టికి మూలమగును గాని, కేవల ప్రకృతి వలన నేమగును. వికృతియొక్కటివలన ప్రయోజనమేమి? అందు వలననే భిన్న గుణముల సమ్మేళనము తెలియుము.

అమృత గుళికలోయన నొప్పుపలుకులనాలించి చంద్రగుప్త సానందకందళిత హృదయారవిందుఁడై తండ్రీ ధన్యుడనైతిని. మీవాక్సుధాధారలఁ గ్రోలగలిగిన నాజన్మము తరించినది. ప్రభో! దీనమందారా, నావలచిన యర్థమునొసంగి కృతార్థుని చేయవే. సత్సంతానము లేని కొరంత మాడందములు నిట్టనిలువున దహించుచున్నది.

ఉ॥ ఇంతి మదేకపత్ని తపియించుచు రాల్కొనుచుండునేడ్చెడున్
సంతతికై, గృహంబొక శ్మశానముకంటె నికృష్టమై సదా
చింతలకాలవాలమగు వంశవివర్ధనుడైన పుత్రుని మా
స్వాంతముచల్లనౌనటుల సాంబశివా దయచేయవేకృపన్ ॥

ద్రాంకితము చేసివైచును. అయిన పైనవర్ణించిన పాఠముల న్నియు నొకేసారి వల్లింపరాదాయన్న నదిమసాధ్యము. క్రింద నిల్చియున్నవాడు మేడపై కొక్కసారిగ లంఘింపనెంచుట నెట్లే యూహ. ప్రతిసోపానము నధిగమించిగాని మేడపై జేరలేనట్లు జీవుడుకూడ నొక్కొకపాఠ మొక్కొక జన్మలో నేర్చుకొనుచు నిట్లనేక జన్మముల నెత్తి, చివరకు విజ్ఞానియై, అవినాభావసంబం ధమున నాలోచేరిపోగలుగును.

ఒకజన్మలో సాధించినగుణపాఠము తరువాతి పాఠమునే రెండవపుట్టువనం దభ్యసించుట. ఇట్లు పాఠములు పూర్తిచేసు కొనవలయును. దీనికే సంచితమనిపేరు. సంచితముకొరకై నొనర్పదగుకృషికే కర్మయనియు పేరు.

నాయనా! ద్వంద్వమయమైన ప్రపంచము, రెండు భిన్న ప్రకృతుల కలయికచేతనే పరిణతినొందగలదు. దానికాదర్శము నాధారము, నాధేయము నేనేయని నిరూపించు నామూర్తి నొకపరి తేరిచూడుము.

సీ॥ ఒక్కవంకఁ బ్రకృతి యువు యున్నది దాని
కుడిపార్శ్వమం దీశ్వరుడను నేను
పాములు విషము నాపై గ్రక్కుచున్నవి
మణిదీప్తు లంబపై మలయుచుండు
గంభీరసారంగ గంగ నాపైనుండు
తచ్ఛీకరవ్యాప్తి తరుణికొడవు

ఆచేఁ గనకపాత్ర యాచేఁ గపాలము
హేమాంబర మచట, కృత్తి యిచట
గీ॥ సర్వమంగళ యుమ, నేను స్థాణుమూర్తి
నిట్టు లాదర్శమూర్తినై యొసగి సర్వ
జీవవితతి విముక్తుల జేయఁగోరి
ప్రకృతి వికృతుల, సంధించి పాటుబడుదు।

అను గుణసమ్మేళనమునగాక భిన్న గుణ సంకలనమువల ననే సృష్టియని యెఱుంగుము. ప్రకృతి వికృతులు అన స్త్రీ పురుషసంయోగమే సృష్టికి మూలమగుఁగాని, కేవల ప్రకృతి వలన నేమగును. వికృతియొక్కటివలన ప్రయోజనమేమి?అందు వలననే భిన్న గుణముల సమ్మేళనము తెలియుము.

అమృత గుళికలోయన నొప్పువాక్కులనాలించి చంద్ర గుప్త ప్రానందకందళిత హృదయారవిందుఁడై తండ్రీ ధన్యుడనైతి. మీవాక్సుధాధారలఁగోలగలిగిన నాజన్మము తరించినది. ప్రభో ! దీనమందారా, నావలచిన యర్థమునొసంగి కృతా ర్థుని చేయవే. సత్పుత్రుఁడు లేని కొరంత మాదంపతుల నిట్టి నిలువున దహించుచున్నది.

ఉ॥ ఇంతి మదేకపత్ని తపియించుచు రాల్కు సుసంగనేర్చెదున్
సంతతినైకె, గృహంబొక శ్మశానముకంబె నికృష్టమై సదా
చింతలకాలవాలమగు వంశవివర్ధనుడైన పుత్రు మా
స్వాంతముచల్లనౌనటుల సాంబశివా దయచేయవే కృపన్ ॥

అని సవినయముగ బ్రార్థించిన చంద్రగుప్తునిగని చంద్రవతాళి కుమారా! ప్రాప్తాప్రాప్తములు, పూర్వజన్మ సుకృత దుష్కృతములంబట్టి యేర్పడును. నీప్రాప్తము నీ వాంఛలకు వ్యతిరేకముగానున్నది.

మ॥ తనయా! భక్తులవాంఛదీర్చుటయె మాతాత్పర్యమగాని నీ
యను భావ్యంబదికాదు వేరువిధమా నైనం విచారింపగాఁ
బనిలే దిచ్చితిఁగొమ్ము పుత్రికనుఁ దత్సాధ్వీలలామంబు దా
ఘనకార్యాచరణానురక్తయగు నీకష్టంబు లీడేర్చెడుఁన్.

అని నొడివిన చంద్రగుప్తుడర్ధాంగీకారసూచకముగ నొక్కింతవడి నేమియు బలుకకుండి పదంపడి, దేవా! ఇదేమి దుష్ప్రాప్తము. అడిగినదేతడవుగా ననేక వరంబుల బ్రసాదించి, యార్తుల నాదరించు ప్రభుడవే, నాయందిట్లు కక్షికము లేక ననంత్యప్రకారం బొసంగితివేల?

శా॥ భోలాశంకరుఁడంద్రు, నిన్ను గరుణాపూర్ణార్ద్రచిత్తుండవై
వేలుఁ లక్షలు, కోరు కేతడవుగా విచ్చేసి భక్తాళి వాం
ఛాలాభంబు ననుగ్రహింతువట,యీమద్భాగ్యమున్నా పయిన్
జాలింబొందవి దేమిపాపమొ కృపాసాంద్రా యుమాశంకరా!

ఇదిమీకు ధర్మమా, పున్నామ నరకము దరింపజేయుటకు పుత్రుడేక దావలయు. పుట్టుకతోడనే యాడపుట్టు వన్యాల సొత్తేకదా. అట్టిదాని ననుగ్రహించిన నావంశము నిల్చుటెట్లు?

తండ్రీ! నా మొర పరిపాలింపవా యని దీనాననుడై విలపించు భూపాలునితో నిట్లనియె.

సు॥ ఇది నీ ప్రాప్తము, తప్పబోవదిది, నీకీజన్మలో పుత్రసం
పదఁ జెన్నా రెడుపాటు లేదు, వినునీ ప్రారబ్ధమట్లైన మే
మది తప్పింపఁదలంపబోము ప్రాప్తాప్రాప్తముల్దిప్పనా
స్పదమూవంతయు లేదుపొమ్మిక యదృచ్ఛాలాభసంతుష్టిమై.

మరియు

క॥ నీతనూజాతవలననే నీకు కొన్ని
యుపకృతులు సంభవించెడు నందువలన
బాపముక్తుఁడవౌదు వాపైని మాదు
సన్నిధివసింపఁగల్గుదు శాశ్వతముగ.

అనిచెప్పి మృత్యుంజయుం డంతర్హితుండయ్యె చంద్రగుప్తుఁడును జేయునది లేక నిజగృహంబునకరిగి, చంద్రునికొరకు బాతక మట్లు తనరాక నిరీక్షించియున్న విమలాదేవికా వృత్తాంతం బంతయు నామూలాగ్రముగ నివేదించిన నాయమయు వంశ వర్ధనుఁడగు కుమారునకు మారుగ కూతురాయని తనలో దాను వితర్కించుకొని పుత్రియైననేమి పుత్రుఁడైననేమి భగవత్ప్రసాదంబని యూరట జెందియుండె. కొంతకాలమునకు విమలాదేవి యంతర్వత్నియయ్యె తదారభ్య నవమాసములునిండు నెన్నడా చిన్నారి కన్నకూనను గన్నులారగాంచు భాగ్యమెన్నడాయని దినములు లెక్కించుచుండిరి.

ఆ॥ వె॥ ఊరుఁ జేరవచ్చి దారాసుతులగతి
నరయనురుకు వెఱ్ఱి నరులబోల్కి
కడుపుపంట నెపుడు గాంతుమా యని వారు
గడెలు లెక్కబెట్ట దొడఁగిరంత॥

యిట్లారుమాసములు గడువ నత్యావసర కార్యములపై దూరదేశములకు బోవలసివచ్చుటయు, చంద్రగుప్తుఁడందు కెంతయు వగచి, నిజతలోదరిం జేరజని కామినీ! నా స్వప్నము కడుఘోరమైనది.

సీ॥ కన్నచిన్నారికూనను గనులజూచు
టెన్నడాయని నెమ్మన మెదురుజూడ
నేడుతప్పనిసరి మన వీడు వీడి
యన్యదేశంబులకు బోవనయ్యెనాకు॥

ఇది నా స్వప్నము. భగవదాజ్ఞ యిట్టిదిగనుండ మనమేమిచేయవచ్చునని కొంతవడి చింతించి చేయునది లేక, భార్యవలనం సెలవుపొంది చంద్రగుప్తుడు త్వరలోనే తిరిగివత్తునని చెప్పి దేశాంతరముల కరిగె.

## చంద్రమతీదేవి జననము.

విశాలాదేవి భర్తృవిశ్లేషమునకు వగచి తన్నివారణోపాయమును, భగవన్నామస్మరణగా నెరిగి శివభజనము చేయుచు

కాలంబు వెళ్ళబుచ్చుచుండె. ఇట్లు కాలము గడచినంత విమలా దేవికి నవమాసములు నిండుచో.

సీ॥ మన్నురుచియించె నన్నము మమతతగ్గె
గండములు తెల్లబడె మేనికాంతి వచ్చె
నడుము మందముగానయ్యె నడలు సోలసె
చూచుకంబులు నలుపెక్కె సుదతి కపుడు॥

అంత పదియవమాసమున, శ్రేష్ఠశుభముహూర్తము నందు, నవగ్రహములు పరమోచ్ఛలోనుండ విమలాదేవి, సుఖప్రసూతియయ్యె. పుట్టినప్పుడే, బాలచంద్రకళవలె ప్రజ్వరిల్లుచున్న బాలికామణింగాంచి యచ్చటనుండు వారాశ్చర్యనిమగ్నులైరి. సూతికాగృహమున కలంకారప్రాయముగాదోచు నప్పసికూనకు, బొడ్డుకోసి, స్నానాదికములు జరిపి, నాటి కృత్యములందేలోటు రానీయక దూతికలు నవరించిరి. అంత విమలాదేవి యనుమతిపై సచివోత్తములు దైవజ్ఞులం బిలువ బంచి జాతకము వ్రాయనేమింప, వారు, శిశూదయకాల ఘటికల నిర్ణయించి, పాప మహాజాతకురాలేయయ్యు, నిజ జనకునకొంత యరిష్టకారిణియగునని నిర్ణయించి వెడలిపోయిరి. విమలా దేవి ప్రాణేశ్వరు డప్పట్టున లేమికి కొంతవగచి, విధివిపాకమిట్టిదైన తప్పనచ్చునేయని యూరడిల్లి పదియవదినంబున శుచిస్నాతయై పదునొకండవరోజున, జాతకర్మ మొనరింపజేసి, చంద్రప్రభా విభ్రాజమాన యగుటంజేసి యబ్బాలకు చంద్రమతీ దేవి యను నామమునుంచె.

## చంద్రమతీదేవి బాల్యము

శుక్లపక్ష క్షపాకరునివోలె నబ్బాలికారత్నము, దినదిన ప్రవర్థమానయగుచుండె. శివప్రసాదమువలన జన్మించినదగుట గావలయు, నప్పసికూన, యాచిన్ని వయసునందె తన సర్వస్వము శివునకంకితముజేసినట్లు తనచేష్టలచే దెల్పదొడఁగె.

సీ॥ జోలపాటలు చెవిసోకిన పోర్వెట్టు
శూలిపాటలువిన్న సోలిపోవు
హరహరాయనుపల్కు లాలించెనా చిన్ని
బోసినోరు మెదల్చి యూనుబుచ్చు
పాలుద్రావెడునప్డు పశుపతీయనియన్న
తొలగి కిలారించి కులుకులాడు
శివభజనవరేణి చేయుచో తన చిన్ని
చేతులఁ దట్టెడు చెలువుచూపు

గీ॥ ఎంతపోర్వెట్టి యేడ్చిన నీశ్వరయన
నవ్వి కేరింత గొట్టుచు నివ్వటిల్లు
పాలుద్రావెడు నా లేత ప్రాయమందె
భక్తి పసిబట్టె నాబాల భాగ్యమేమొ॥

అని, చూచువారందఱు నివ్వెరపడులాగున నబ్బాలి పెరుగుచుండె. విమలాదేవియు, తన ముద్దుపట్టి యద్దుముద్దుల నవలోకించుచు నానందపరవశురాలై, యాచిన్నికూన కభీష్టమైన శివనామస్మరణము నేమరక సేయుచు కాలంబుబుచ్చె. ఒక సం

త్సరము నిండునప్పటికి తప్పటడుగులు వేయుట, యరమార మాటలాడుటయు నొదవె.

చం॥ చివచివయన్న శబ్దములచే పలుకాడెను, తప్పటడ్గులా
శివుడెటు తాండవించెనటు చిన్నిపదంబుల జిందు ద్రొక్కు, నె
య్యావసరమందు నేని శివునట్టులె మెల్లదలంచుఁ బాప కె
ట్లవగతమయ్యెనో విబుధులైన నెఱుంగ శైవతత్త్వముల్ ।

అట్లు శైశవంబుననే యబ్బాలిక శివనామామృతసార ముం జవిగొనుచు, నైదువత్సరముల వయస్సువచ్చినంత తనతో నాటలాడవచ్చిన ఈడుపిల్లలతో కలిసిమెలిసి యాడుచు, నానం దమున నోలలాడుచు, కాలంబు గడపుచుండె. విమలాదేవి చిర కాలమునకు తనవాంఛ తీరినందులకు మిక్కిలిగ సంతసించుచు, నిట్లు కాలంబు బుచ్చుచుండ, బా లి క కయిదువత్సర ములు పడుటయు నీడుబాలికలగూడి యల్లారముద్దుగ నాడుచు

సీ॥ శివనామమేసుడీ భవరోగజనితమహా
చింతలడంచు సంజీవకరణి
హరుకీర్తనయెసుడీ, పరమార్థముల దెచ్చు
పాపాటవులజీల్చు పరశుధార
శంభుసేవలెసుడీ జ్ఞానామృతముజిల్కి
యజ్ఞానతిమిరము నార్చుహాళి
శంకరార్చనసుడీ సంసారసంకట
భీతచేతస్కుల యూతకట్టి

కబరీభరంబదే కారుమబ్బులుకాగ
నం దుదటిల్లత లమరుటెట్లు?
లోలాక్షి చంచలాలోకనమ్ముల కాంతి
మించుల రుచిమించి మెరయకున్నె
యైనఁ దారకలెవ్వి? యధరబింబమునంటి
వదనమం దమరిన రదనపంక్తి
సీ॥ యింద్రధనువొప్పునా? ఒక్కటేమి రెండుఁ
మదనచాపసమాకృతి మలయు బొమలు
నిర్మలాకాశశూన్య యూనెలతమిన్న
రాగశూన్యయు లోకాభిరామ భామ॥

ఇట్లుచూచువారెల్లరు ప్రసింశించుచుండ.

సీ॥ తప్తచామీకరాభమై దనరుమేను
నవ్య శశిరేఖబోలు సుందర ముఖంబు
పిడికిటం దగిపోయెడు పిన్న నడుము
లలన తానొప్పె మదనశలాకవోలె॥

ఆసమయమున నైన నారాచపట్టి పూర్వవిధానము న్వీడువక యధాస్థితిగా నాడుచు, పాడుచు శివుగీర్తించుచుండ విమలాదేవి కూతుంజూచి తల్లీ! ఇదేమి ఇంతటనైననీవు నీ మతము నుజ్జగింపరాదా రాచకొలమునబుట్టి, యంతఃపురముల యందుండదగు నీవు కేవల సామాన్య బాలవలె వీధులయందు బాడుట, యాడుట మున్నగునవి చేయరాదు. చిన్నతనమున

న్న నెట్లో సరిపోయె. సంప్రాప్తయౌవననైన నీవట్లొనర్చుట కానిపని. యని మందలించిన తల్లింగాంచి "జననీ! ఎంతభ్రాంతి నొందుచుంటివి. దైవసేవకు స్థలాస్థలములేమి? కాలాకాలములేమి.?

—: చంద్రమతీదేవికి, విమలాదేవి బుద్ధులు చెప్పుట :—

సీ॥ లేదువో నీకపవాదలజ్జాభీతి
కులగౌరవమునైనఁ దలుపవలదె?
రాదువో బుద్ధి పరామర్శ నీయంతః
గరపినైనన మేలరయరాదొ
కాదువో నీదారి క్రమ్మరించువిధంబు
గృహమునైనన వర్తింపరాదొ
పోదువో నీబుద్ధి పురుషోత్తమునివీడి
హృదయపీఠిని నిల్పి యెసగరాదొ
గీ॥ రాచపుట్టువుఁ బుట్టి మర్యాదవిడచి
భజనలని యాడి పాడుటపాడిగాదు
చిన్నతనమైన నెట్టులో చెల్లిపోవు
తల్లిరో! జవ్వనివి యిప్డు తగదు తగదు॥

నిన్నుగూర్చి యెందరెన్నివిధముల వాకొందురో యోజింపలేవు. ఏకాలమునందెట్లు మెలగవలయు నట్టులున్న నే తగిపోవుకాని, లేకున్న వెగటుగాదోచును. కావున నాచిట్టితల్లి నామాటవిని నీవతఃపురమునందుండియే పురహరు ధ్యానింపు

చుండుమని మందలించెదు విమలాదేవినింగాంచి తల్లీ పరమేశ్వరు నర్చించుటకు స్థలాస్థల వివక్షయెందులకు? అతడులేని స్థలమెం దైన గలదా.

గీ॥ అణువు మొదలు బ్రహ్మపర్యంత మతడెయుండ
లేనితావేది? యర్చింపరాని స్థలము
కలద? సమయాసమయ వివక్షలనుమాత్ర
మేల? పరమేశ్వరార్చన నెలమిసేయ॥

తల్లీ! లోకులెట్లనుకొన్న నాకేమి? మానాభిమానంబులీ కారణ కళేబరమునకే జెందును. గాని యాత్మనంటగలవా? ఎవరికోసమో నేను నామనశ్శుద్ధిని పాడుచేసుకొనవలసినదేనా? అయ్యో, ఇదేమిబోధ? పరాత్పరుని భజనము సేయుటయును పరులకుబాధయేనా? అమ్మా నీవేమైనచెప్పుము. మీయాదేశము నేను మన్నింపజాలను. మన్నింపలేను.

ఉ॥ అదియేమో హృదయం బహర్నిశలయుండాముూర్తి పాదా
ర్చనా
పదమే కోరెడుగాని సన్యవిషయ ప్రాప్తింబునేమాత్ర మెం
చదు, తప్పించిన దప్ప బోదువిను స్వేచ్ఛాజీవినైగోల్చు స
త్పదసే నాకు రుచించు గోప్యవిధముల్ పాటింపలే
నమ్మరో॥

అజ్ఞానవశంబున నపార్థములుచేసికోపి నిందించువారితో నాకు నిమిత్తములేదు.

ఉ॥ పుట్టుచు, గిట్టుచుఁ మగుడబుట్టుచు గిట్టుచునిట్టులెన్ని మో
పుట్టువులైనఁగాని తనపుట్టుక హేతు వెఱుంగజాల డ
ప్పట్టునగాని జీవుడు విపాకముగోరడు కోరిలోక సా
మ్రాట్టును భక్తి సేయును విరాగమునొందియు ముక్తు
డయ్యెడుఁ॥

—: చంద్రిమతీదేవి, తల్లికి తన నిశ్చయమును చెప్పుట. :—

మరియు,

ఉ॥ ఎందులకీ ప్రపంచమున నేను జనించితి నేమిసేయనో
నెందరు చచ్చిపోయి రిక నెందఱు చావగనున్న వారు వీ
రందరు జేరుటెచ్చటికి యాశ్రయమేదియటన్న జ్ఞానముం
బొందిననాడె యీశ్వరునిబొందు తలంపుదయించు జీవికిఁ॥

కావున, తల్లీ! అజ్ఞానుల న్యరాలాపముల కదరి నాస్వేచ్ఛ
కరికట్ట యత్నింపకుము. నా దేహ, ప్రాణ, మానములను సర్వ
స్వము పరమేశ్వరాంకితముచేసి యాతని నారాధించుచుంటి.
అన్నిటికి నాకతడే పడుగడ.

మ॥ అతఁడే నా యిలవేల్పు నేనతనికే యత్యంతముంగూర్తు, న
న్నతఁడే బ్రోచెడుఁ గర్తయై, చెలువుఁడై యాచార్యుడై
యెన్నఁడేఁ
నతనిం వీడగలేను నన్నతడు బాయంజాల డేనాడు నే
నతఁడేనేనగు, నేనెయాతఁడగు మాతా! ఏల చింతింపగఁ॥

ఇది నా నిశ్చయమనుచున్న చంద్రమతీదేవి నక్కునం గదియించి చెక్కిలి ముద్దాడి, మూర్ధమాఘ్రాణించి విమలాదేవి యానందమున దోగుచు నీయట్టి యుత్తమురాలిం బట్టిగాగన్న నా భాగ్యమే భాగ్యమనుచు నుతించి మిన్నకయుండె.

—: చంద్రగుప్తుఁడు యింటికి మరలివచ్చుట. :—

అంత కొంతకాలమునకు జైత్రయాత్రా నెపంబున దేశాంతరమున కేగిన చంద్రగుప్త మహారాజు పండ్రెండు నిండు సంవత్సరములు దండయాత్ర సాగించి, నానా దేశాధీశ్వరులం జయించి, వారి వలన గప్పంబులంగొని భాండాగారములు నిండించి, యుద్దండుడై యెదుర్కొను వారెవరును లేమి పరదేశావాసమేలనని, నిజనగరంబునకున్మరలె. మల్లికానగర పరిసరములకుం వచ్చినంత దనరాక పట్టణంబునను, నంతఃపురంబునను ముందుగా దెలియజేయ దూతలంబంపిన వారు నట్లే యొనరించిరి. అవ్వార్తవిని విమలాదేవి యమందానందమున బొంగుచు, గూతునకుందెల్పి, యామె ననేకరీతుల నలంకరించి, చంద్రమతీ దేవితో, ననేక దాస దాసీజనంబులు వెంటరా, భర్తృదర్శనార్థ మెదురుగఁబోయిన, చంద్రమతీదేవియు నపరిచితుడేయయ్యును, దండ్రికావున జంకును, గొంకును లేక చంద్రగుప్తుని సమీపించి, పుష్పహారము మెడవైచి, అర్ఘ్యపాద్యాదుల సంతృప్తుంజేసి కైదండ యిచ్చి స్వయముగ నామెయే, తండ్రిని గృహాముసం బ్రవేశపెట్టె. చంద్రగుప్తుడట్లు తనకు సపర్యల జరుపుచున్న

చంద్రిమతీదేవి యతిలోకసౌందర్యముం గన్నులార గాంచుచు నిధిపేరితుడై యిట్లని తనలో దావితర్కించుచుండె.

సీ॥ మదన జగదేకపూజ్య సామ్రాజ్యలక్ష్మి
యీ రమామణి యెవతయో యిందువచ్చె
ేలనో మాకు కైదండయిచ్చి మమ్ము
నింతగా గారవించుట కేమిగతమొ ॥

ఉ॥ ఈ లలితాంగి సొంపు భళిరే కనువిందగుజూడ జూడనే
వేలుపు సానియో యలరువిల్తుని రాణియొ నాగదోచి నా
తాలిమిడీలుబుచ్చెడు ప్రతాపముల్ వచ్చెడు, ధీరచిత్తముల్
గాలము వేసిగుచ్చెడు వికారము గూర్చెడునేమి సేయుదున్॥

అని యివ్విధమున దలపోయుచు

శా॥ ఔరా! యియ్యెల నాగసోయగము ధైర్యస్థైర్య చిత్తంబులన్
స్విన్నరై పారగజేయు, సన్మునులనే నిర్విణ్ణులంజేయు నీ
స్మేరాంకూరము పండువెన్నెలకళల్ జెందాడెడున్ జెల్లరే
యీ రామామణి పొందుగాంచుటయె కా యిందిత్వ
మూహింపగన్.

అని యనేకవిధముల దలపోయుచు, పూర్వజన్మదుష్కృతి విపాకమువలన, యుక్తాయుక్తముల గురితింప నేరక, వావి వరుసల గణింపబోక, నమ్మత్తకాసినిపై చిత్తమత్తమిల్ల మన్మథ బాధాపీడితుడై యనేక యూహాశకటము లంతర్వీధిని బరుగు

సాగుచుండ కింకర్తవ్యతా విమూఢుఁడై, కామపిశాచము కల్గించిన కావరము కన్నులు నిండ నాలేమ నాపాదమస్తకము దేరిపారజూచుచు గంగవెఱ్ఱులెత్తిన వానికైవడి శివాలాడుచు నామె పైకురుకయత్నించు చంద్రగుప్తుని యునికిగాంచి నివ్వెరపడి చంద్రమతీదేవి యచ్చటనున్న ముప్పు తప్పదని వేటకాని పసిపట్టిన బాలకురంగమురీతి నచ్చోటువీడి చెంగున పరుగువారదొడఁగె. చేజిక్కిన మృగము తప్పిపోవ వెంటనంటు మృగయునివలె చంద్రగుప్తుఁడామెను వెంటాడెను. అచ్చటనున్న వారెల్లరు నివ్వెరపడి వెఱ్ఱిబొమ్మలవలె కన్నులప్పగించి యందే నిల్చిపోయిరి. పాపము విమలాదేవి కొక్కమాటయైనను నోట వచ్చుటలేదు. ఏకధారగ కన్నుల నీరొలుకుచుండ కుప్పవలె ధరాతలంబునఁ గూలిపోయె. తక్కుంగలవారందరు కొంతవడికి తెప్పరిలి, ఛీ ఛీ పరమఘోరము. ఘోరకలి, యింతటి యవాచ్య సంఘటనఁ మెందైన విందుమేయనుచు ననేక భంగుల నీసడించుచు, నేమియుం జేయఁజాలమి నందే యుండిపోయిరి.

—: చంద్రగుప్తుఁడు చంద్రమతిని మోహించి వెంటాడుట. :—

చంద్రగుప్తుఁడట్లు చంద్రమతీదేవిం దరుముచు నిట్లనియె.

చం॥ నిలునిలు మెందుఁబోయెదవు నీరజగంధిరో నన్నుఁదప్పి కో
డలచెదు కాని నీవెచటదాఁగినవీడను వ్యర్థవాంఛ చే
నలిగెదవేల ? నామదికి నచ్చినదానవు నిన్నుఁగూడ కే
దలపునువీడజాల నిదితప్పదు తప్పదు రమ్మురమ్మికన్॥

అనుచు గదియరావచ్చు భూపాలుని తప్పించుకొని ద్విగుణీకృతమున బరగువారుచు నిట్లనియె.

ఉ॥ తగదిది బుద్ధికాదు. విను తండ్రివి నీవు కుమార్తె నేను శ్రీ
భగవతితోడు నీతలపుపాపము మానుము పితృదృష్టితో
మొగమొకసారి కన్గొనుము పోల్కిపరస్పర బింబితంబులై
నెగడెడునో పృథగ్విధమె నీకె యదార్థము బోధ యయ్యెడున్॥

అని చెప్పుచున్నను వినక చంద్రగుప్తు డెకసక్కెములాడుచు, కామినీ! ఏమంటివి. నాకుసంతతియా ఇట్లునన్ను కల్లబొల్లి మాటల జోకొట్టెద నీమాయామాగుడుల జిక్కువాడకాను॥

చం॥ సరిసరి యేటిమాటలివి సంతతియా? యనపత్యుడైన యీ
నరునకు నీవు కూతురవో నన్నొకబుట్టువు బెట్టజూచు నీ
కురుసుపదాలు నాచెవులదూరవు మారుడు క్రూరబాణముల్
బరపుచునుండె తాళనిక భామరొ తామసమూగి రమ్మికన్॥

అనిన చంద్రమతి, తండ్రీ నేను జెప్పినదంతయు సత్యము మాయమ్మ చెప్పుటచే నేను మిమ్మెఱింగి, తండ్రియనుగౌరవము పెర్మి మిమ్మెదుర్కొన వచ్చితి నందున నింత బోరసె.

సీ॥ అయ్యరో మీరల నపత్యులాట నిజమొ
యమ్మకోరికపైని శ్రీ హరుని గూర్చి
తపముఁ జేసి మెప్పించి నందనును నన్ను
గంటిరటమీ రలిది సత్యకధనమ్మ గాను ॥

అనుచు త్రిగుణీకృత వేగమున బారుచున్న సతీమణి వెన్నుదొక్కుచు, భూపాలుండిట్లనియె.

చం॥ ఇదియొక నాటకంబు, తుదకీశ్వరుఁ జేరఁ కాసి తప్పు
లన్నియుం
బొదుపుదు రంతెగా యతఁడు ముందుకువచ్చిన సాక్ష్య
మిచ్చునా ?
సుదతిరొ చాలుఁజాలు కడు వోద్యమునించెఁ ద్వదీయకల్పనల్
వదలుముమంకు నీపలుకు పట్టి యబద్ధము రమ్ము రమ్మికన్ ॥

— చంద్రమతిని, చంద్రగుప్తుడు పట్టుకొనుట —

సీ॥ అనుచు ద్విగుణీకృతా వేగమున గమించి
బారెడేసియంగలు జాపి పరుగుదీసి
చెంగుచెంగున దూకెడుమంగళాంగి
కేలుకేలున సంధించి జాలిమాలి ॥

నిలిపి, చంద్రగుప్తుడు, రమణీమణీ, నీవెంత యీసడించినను, నేమైనను నిన్విడువజాలను. ప్రథమదర్శనముననే నా

మానసము నీ స్వాధీనమైనది. ఏదియెట్లయినను సరే నిన్ను విడువ జాలను. నా మనోవిచారము నించుకైన యోచింతువా.

సీ॥ కురులచీకటికప్పు తెరజొచ్చికంపించి
ముఖచంద్రుకళగాంచి మురిసియాడు
చూపుతూపులవాడి సోకుచో పసదూలి
బింబాధరముగాంచి డంబుమీరు
గళసంకుపల్లము గడచుచో దిగజారి
కుచగిరులెక్కి యా కొందువమాన్చు
త్రివళి నిచ్చెనమెట్లు దిగి చెమర్చుటజేసి
నాభిగుండమున స్నానమునకురుకు
వట్టిదైనంత గానుగన్పట్టఁబోయి
శూన్యమేయని యట్టిట్టుచూచిచూచి
యుష్మృతకూపము డాయగా నడ్డమైన
తెరను గమనించి నెమ్మది మరలిపోవు ॥

ఇక నేనోర్వజాలను, రమ్ము నీ కౌగిలినిమ్ము. చెలువా యని పైకొనబోవు నయ్యెదనునే విమలాదేవి పరుగుపరుగునవచ్చి నిజనాథు చేతులంబట్టి, కన్నుపట్టిం వెనుకకునెట్టి ప్రాణేశ్వరా. ఘోరకలి ఘోరకలి ఎట్టిపామరులేని, జేయగడంగని, కాదు కాదు ఊహింపనైన యూహింపని, యీ ఘోరదురంతము మీ కన్నదానియందు మీరా సేయుట.

మ॥ ఇదిమీనోములపంట ఈశ్వరకృపాహేలా విశేషంబుచే
నొదవెం గర్భములోననున్న తరి కార్యోద్యుక్తులై
పోయి యి
పదిరెండేడులు రాకపోవుటచె చంపాతన్వి గుర్తించు నా
స్పద మావంతయు లేక యివ్విధిని సంప్రాప్తించె దుర్యో
గముల్

మీపాదములంటి వేడెద నిది ముమ్మాటికిని సత్యము. ఇంతటి దారుణకృత్యమున కొడిగట్టి నాకడుపున నారనిచిచ్చు పుట్టింపకుడని యనేక భంగుల బ్రతిమిలాడుచు, నెన్నివిధముల చెప్పుచున్నను విధిబలవత్తరమై పూర్వస్మృతి యావంతయు లేక భార్యచెప్పునదంతయు బూటకముగా మదినెంచి, తన పరోక్షమునం దీకన్నెయను కాంచెకాబోలునను సందియమున మండి పడుచు.

చం॥ తెగి మగవారలేనియెడ దెంపరి సంతతి గాంచినట్టి యో
తెగువరి నీవు నేటికొక తీర్పరివైతివె చాలుజాలు నీ
యగడును గప్పిపుచ్చుటకునై వలగన్న యభూతకల్పనల్
జగమును మాయజూపు మము సమ్మతి బుచ్చగ నేవు
పొమ్మికన్॥

కం॥ నీ పాపాచరణంబు, ను
మాపతిపై మోపి తెల్పు మాటలతోడన్
గోపముఁ దీర్పఁ దలంచెదు
నీ పలుకులు విశ్వసింపనేరను కులటా॥

అని పల్కుచు, తన బాహుదండమునెత్తి, తత్తరిత్తరా
కలపై నొక్క మొత్తుమొత్తిన సక్రాంత, మూలచ్ఛేదమైన కదళీ
కాండంబువోలె నేలకొరిగె. చంద్రమతీదేవియు తల్లిపాటునకు
సైరింపలేక హాహాకారంబు లొనర్చుచు మాతృదేవిని సమీ
పించబోవు నెడ, చంద్రగుప్తుడామె కరంబుంబట్టిలాగుచు కామినీ!
నీ వెట్టిదానవైనను మాకు భోగ్యవే. శోకమూర్తివయ్యును
నీవు నా మానసమును చూరగొనుచునే యుంటివి. అట్టి నిన్ను
నేవదలలేను.

సీ॥ పరిపూర్ణ చంద్రబింబమువోలు మోముపై
చెమట బిందువులు ముత్తెములసంగి
వరఘనాఘనకాంతి బొరయు పెన్నెరులింక
మలయుచో సురనీలమణులసంగ
సవ్యాభర్మశలాక నాయొప్పు నెమ్మేన
గ్రమ్ము దుమ్మది పుష్యరాగమనగ
యరవిందముల శేవసలరు కన్నులదోచు
నరుణ రేఖలు కెంపు ననుకరింప
గీ॥ కోయిల కుహూకుహూరవంబు దూయు వాణి
గద్గదికమయ్యు నవవజ్ర కళినమనగ
లోకమోహన గాత్రివి శోకమూర్తి
వయ్యు వరరత్నమయివి నాకైతివబల॥

సీ॥ ఇట్టి నిన్నెడ నే వీడుకోడ, విడచి
బ్రతుకుటయుకూడనా? పట్టి భ్రాంతిగాక

రమ్ము నీ దాసు నన్నేలుకొమ్ము సుఖవి
కమ్ము కోపమ్ము విడుమిక కమలగాత్రి ॥

అని కామావేగమున పైకురుకనున్న భూపాలుని దప్పు
కొని చెవులు మూసికొనుచు

చం॥ శివ శివ యెట్టి నీచమగు చేతకుబూనితి కన్నకూతునే
గవయుదువా? మనుష్యుడవుకావ? విచక్షణలేద? పృథ్విపై
నెవడైనంగలాడ క్షమహీనత నీవలె సంచరించునా ?
యవమతి, ధూర్తుడా ! పశువులైన నొనర్చునె యిట్టి
చెదముల్

ఉ॥ అంతటి ధీరచిత్తుడు మహాత్ముడు దాత్తుడు సత్యవాది ధీ
మంతుడు లేడు లేడనుచు, మా జనయిత్రి త్వదీయవర్ణనా
క్రాంత మనస్వియై దెలుపగావిని యెన్నడువచ్చు నెపుడు నే
గాంతునటంచు కోరితినిగాని యిటౌటలెఱుంగ నయ్యయో ॥

అని వేడుచు, నావేదనపడుచున్నను వినక చంద్రగుప్తుడు
మరి మరి డాయుచు

సీ॥ బిగుతు కంచుకమున బిగిసిపయ్యెద కప్పు
చున్న యౌవనచిహ్న ముబ్బిపొడుచు
నూరి, యూరి, రసంబుకూరి యెఱ్ఱకాంతి
బారసి వాతెరబింబ మురలబారు

నురియాడి, యురియాడి మొరసి తేనెక్కన
కన్నులకెందళ్ళు కడఁక గాంచు
కురియించి, కురియించి గోనబు ముద్దులసోన
నునుచెక్కుటద్దముల్ నూగునీగు
విరియ బాఱెడు, యౌవన వీర్యమెల్ల
యంగకములందుఁ జేర నిల్లైతివీవు
భామరో! నిన్ను గూడకఁ బ్రతుక లేను
రమ్ము కౌగిలినిమ్ము సుఖమ్ముగొమ్ము ॥

అట్టి నీ యౌవనలక్ష్మి మాకు జోహారు లొసఁగుచు, చేరరమ్మని ముద్దు ముద్దుగ మమ్ము జీరుచుండ, శైలా! నిన్ను వదలి దూరముగ జననోపుదునా ?

సీ॥ చిప్రరాకు కాచు వచ్చియురాకమునుమున్నె
కోయిల లేమావిగున్న కెగయు
పూవు యౌవనశోభ బొందునో మరి లేదొ
తుమ్మెదలటుఁ జేర దుముకులాడు
పండువెన్నెల కాంతిపై సోకి సోకక
శశికాంతము ద్రవించి జాలువాఱు
కొదమ పెంటింగూడ నెదయయ్యెనో లేదొ
పోతు వెన్నంటి యా కూతదెల్పు

గీ॥ పరిణయినీ ప్రణయుల ముగ్ధభావములను
గూర్చి ముడివెట్టి ప్రకృతి జోకొట్టుచుండ

నవవయోవిలాసిని వీవు నాయకుడను
నేను నిను కోరరాదె రాకేందువదన ॥

ప్రకృతి విరుద్ధమైన పనులకు బ్రాల్గొల్పెదనని భయపడె
దవా? కామినీ నీ విమతమువీడి నన్ను చేపట్టి స్వర్లోకసుఖంబుల
నొసంగి యాదరింపుమా యని చంద్రగుప్తు డకాంతాశిరో
రత్నమును బల్మిమైపట్టి యక్కునజేర్చు మక్కువ కన్పరచుచుండ
నయ్యెక్కన నెఱెంగిన చక్కరబొమ్మ గ్రక్కున వాని వదలించు
కొన యత్నించుచు, చేతులతో విదలించుచు,

ఉ॥ ఓ మదనార్తుఁడా వదలు మూరక చిత్తము తత్తరింపగా ।
కామకళా విశేషమును గాంచదలంచెదు కాని సత్యమే
మోమదినెంచవైతి విదియొప్పుడు తల్లినిజూచి నేను ని
న్నేమియు జేయలేనైతి, యింక భరింపను దుష్టచేదముల్ ॥

వదలుము, వదలుము, అని విదలించుచు

శా॥ కాదా నీవిక దిక్కుగాన వదిగో కాత్యాయనీ భర్త స
న్నోష దార్చందయసేయు నాతఁడు మదోద్యోగంబు సైరింప క్షీ
వేదారింబడిపోయిన స్విషడు నీవేకాదు నిన్బోలు ను
న్మాదుల్ప్రవరు బూదిపాలయిరి దుర్మార్గా ననుస్విడుమా!
అని పల్కుచున్న కామినీమణింగాంచి నగుచు చంద్ర
గుప్తుడు.

కాంతా నీ బెదరింపులకు నేనేమాత్రము వెనుదీసి నా
ప్రయత్నము విరమించుకొనబోను. తాటాకుల చప్పుళ్లకు కుం

కేళ్ళు బెదరునా? నీమూర్ఖము నీకే చేటగునని గుర్తింపుము.

సీ॥ కండ్లుచిల్లులుపడు కరణి ధారాపాత
ముగ నేడ్చుచున్న నేమగును చెలువ
మనసుండబట్టక మారాముబెట్టుచు
గునిసి యాడిననేమి గొనరు లలన
హృదయతంతువులుగోరింపఁ బ్రశాంత జీ
వితము కోసిన నేటిగతి లతాంగి
నూరేండ్ల బ్రదుకులో నారనిచిచ్చు ర
గుల్గొలిపి ననరు టేగుణము కలికి

గీ॥ నిన్ను విడిపించు ధీరులాసున్న మాయ
మంత్రములు సాగిరా విఁకేమాడ్కి నేని
పాలతరగల వెన్నెల బోలువయసు
నేల వృధజేతు రమ్ము నన్నేలుకొమ్ము॥

అని మరింత విజృంభించిన నచ్చెలువ

ఉ॥ వాగితివా, యికస్వేడువ వచ్చిన పాపము రానునన్ను, నీ
బాగునుగోరి తండ్రివని వారకనోర్చితి నింతదాక నీ
రోగము హెచ్చె, మద్విభుడు రుద్రుఁడువచ్చెను దీర్చు నీరుజన్
నాగులకోటికేళి యెలనాగలతో జెలగాటమాడుటల్॥

నీచుడా! ఇంక కాచుకొమ్ము. స మి జ ప గు నో నీవే చూచెదవు. చంద్రగుప్తుఁడు నగుచు ఓసి వెఱ్ఱిపిల్లా, నన్ను బెద

రించుచుంటివా ? పిల్లవచ్చి గ్రుడ్డును వెక్కిరించినట్లున్నది నీ చందము. అనేకసంవత్సరము లుగ్రతపంబొనర్చిగాని దర్శన మీ బోని పరమేశ్వరుడు నీ పిలుపుమాత్రమున నిందు నెలసి నన్ను పిలుకుమారుచునా ? కానిమ్మదియు చూచెదను. నీమూలముననైనను పరమేశ్వర దర్శనము లభించును. ఓసీ బేలా.

సీ॥ భువినిగల ప్రేమరసమెల్ల ప్రోవుచేసి
హృదయ పేటికలోనింపి పొదలుచున్న
ప్రణయసామ్రాజ్య మహనీయభాగ్యలక్ష్మి
వనుచు డాసితి ప్రేమభిక్షార్థి నగుచు ॥

అట్టి నన్ను నీవు నిరాకరించరాదు. ఆశ్రితుల నలమటిల్ల జేయుట ఘోరాతి ఘోర విక్రియ అన, చంద్రమతీదేవి.

కం॥ ఇది నీ ప్రారబ్ధము చక్కదిద్దుటకు నేనేకాదు లోకత్రయీ!
హానీశసం
విదుడో శంకరుండేని జాలడు వృథా వేడ్కోలు బేలా, ఇక
హృదయాధీశ్వరు నీశ్వరుం బిలుతు వాడేవచ్చి నీ తాపము
మదిసేయుం మదనార్తి దీరుటకిదే ప్రార్థింతు దుర్మార్గుడా !

అని కరకనులంబులు ముకుళించి, నిశ్చల చిత్తయై యీశ్వరుని బ్రార్థింపదొడగె.

ఆ॥ వె॥ నీరు పల్లమెరిగి పారెడు కైవడి
వలపుతనము దెలిసి వెలికిబారు

పరమశివునిగోరి మురియు నానందము
దునుసు నిన్ను జేర దరమె చెపుగ ॥

ఇక నా యత్నము లేదు. నా పరమేశ్వరుడే నాకిక దిక్కు అని కరకములు ముకుళించి

—: చంద్రమతీదేవి ఈశ్వర ప్రార్థనము చేయుట :—

శా॥ దేవా! దీనజనావనా కరుణరాదే నాపయిన్ దుష్టుడీ
భావోన్మాదుఁడు బల్మి నగ్నవయుచో పాషాణ చిత్తుండనై
నీవే పల్కకయున్న దిక్కెవరు నిన్నే నమ్మి యున్నాళ్లు నీ
సేనల్ జేసిసదాని కీఫలితమా శ్రీ విశ్వనాథ ప్రభో ॥

శా। సేవాభాగ్యమునిచ్చి నన్నిపుడు రక్షింపంగదే శంకరా!
రావే దీనత దిక్కుమాలితిని సంరక్షింపనా తండ్రియే
భావోన్మాదము నొంది నగ్నవయుగా బారింభుడైనాడహా
నీవే యాపద దీర్పగావలయు మన్నీడా! కృపాసాగరా!

కన్నీరు మున్నీరుగాగ నేడ్చు భక్తురాలి నాపద దీర్చ నెసంబున భక్తపరాధీనుఁడగు భగవంతుఁడు.

:— ఈశ్వరుఁడు ప్రత్యక్షమగుట —:

సీ। మిన్నేరుపహారోరును వెన్నుదన్నెడుపోరు
చిన్నారిజాబిల్లి చేయుచుండ

వాలిన క్ష్వేళాగ్ని కీలలన్వాలగొని
యెఱగంటిమంట పైకెగయుచుండ
నూర్పుల పెనుగాలి హూంకరించుచు బారు
పో తెద్దు విసురుగాడ్పులతో గలియ
శూలాయుధంపు విస్ఫూర్తి తేజము బొమ్మ
ముడిపాటుదీప్తిశోభ గడలుకొనగ
సీ॥ భూనభోంతరములు నిండి బుగులుకొల్ప
గోత్రములు కూలద్రోసి దిక్కులగదింప
వాయువేగముగా వాహనమునుదోలు
కొనుచు రుద్రుఁడు విచ్చేసె కనలుకొనుచు ॥

ప్రళయరుద్రావతారుడై యరుదెంచిన పరమశివుంగాంచి భయకంపిత గాత్రుండై నిశ్చేష్టుఁడై సర్వేశ్వరపాటున నేమియు బలుకనోడి నందిగుప్తుండు నేలకొరిగె. పరమ భక్తాగ్రేసరురాలగు, సాక్షి యానంద విస్మయము లావురింప నిశ్చేష్టయై తెప్పరిల్లి ప్రార్థింపదొడగె.

కం॥ హరహర కరుణాసాగర
యరుదెంచితివా భయార్తినడరెడు నన్నుం
బరిరక్షించెదవా యీ
దురితాత్ముని బారితీర్చి దుష్టసహస్తా ॥

దేవాదిదేవా, దీనబంధో, కరుణాసాంద్రా, నమస్తే, నమస్తే. దుర్నిరీక్ష్యమైన నీ మూర్తి నుపసంహరించి, మంగళ

స్వరూపము గైకొని దర్శనభాగ్యము ప్రసాదింపవేడుచు పాదాంబుజములపైబడి ప్రార్థింప, శంభుండు దర్శనీయమూర్తియై దోచి మహాత్ముండగు చంద్రగుప్తు నిట్లని శపించె.

— చంద్రగుప్తు నీశ్వరుడు శపించుట —

శా॥ రే రేదుర్మతి, యెంత జేసితివి నారీరత్న మిట్లాలసి
గారాబంపుతనూజ దీని గనయంగా గోరు దుర్మార్గ చిం
తా రోగంబునకౌషధంబుగ హరిద్రగ్రావ రూపంబునన్
దారస్థాయిగ గంగనుండుము మిది మహాదర్పంబులోకంబుగన్

సీ॥ నీవు పాతాళగంగలో స్థావరముగ
పచ్చబండవునైయుండ బడెదు కతన
పచ్చనై తజ్జలంబు చూపఱకుదోచి
నిన్ను నిందింతురుగాత ననేక విధుల॥

సీ॥ పాప మేనాటికేనియు బండిపోవు
ప్రహరణములు, చీవాట్లు యాపాపిఫలము
తేలుతేలన్న జెప్పుతే తెమ్మటండ్రు
గాని పోనిమ్మనెడువారు కలుగబోరు॥

అని శపియించినఁ జంద్రగుప్తుండు కన్నులువిచ్చి ప్రళయకాల రుద్రుడుగా తనకు కన్పించుచున్న మూర్తిం జూచి నమస్కరించుచు, పాదంబులపై నొరిగి దేవాదిదేవా! దీనశరణ్యా! రక్షింపుము రక్షింపుము.

## — చంద్రగుప్తుని పశ్చాత్తాపము —

ఉ॥ క్రూరుడ బాపచిత్తుఁడను గొంకక కన్నకుమారినే యెదఁ
జేరుపనెంచుపాపమును జెందితి, బొందితి దద్ఫలంబు క
ప్పారెను గండ్లు విప్పితిని యయ్యయొ నేయుగమందు నేదురా
చారులుచేయబోని తమసంబును బొందితి నేమిపాపమో ॥

ఉ॥ ఎన్ని వ్రతంబులోసలిపి యేమియుగానక నేకదీక్షతో
నిన్నుగురించి పెన్దపము నేమముగా నొనరించి కంటి నీ
చిన్నకుమారి దీనినిటు జేసితి సత్యముఁ జెప్పవచ్చు నా
యన్నలమిన్న సత్సతిని యార్చితి నోర్చితి ఘోరపాపముల్ ॥

ఇట్లనేక విధంబుల దెల్పుచు గన్నీరు మున్నీరుగా నేడ్చుచు, బునఃపునః ప్రణామంబులాచరించుచు, కరుణామయా శరణుజొచ్చితి నీ యుగ్రరూపము నుపసంహరించి నేత్రానందమైన సాధుమూర్తివై ప్రసన్నుడవుకావే యని ప్రార్థించిన నీశ్వరుండు కరుణాయత్తచిత్తంబున ననుగ్రహించె. చంద్రగుప్తుడు సంతుష్టాంతరంగుండగుచు నమ్మూర్తిని కన్నులార జూచుచు మహానుభావా! ధన్యుండనైతిని. నీదర్శనముచే నాకు ముక్తి చేకూరె. పరమ కరుణాసముద్రుడు పరమేశ్వరుడనుట నాయందు ప్రదర్శించితివి. శాపగ్రస్తుని జేయునెపమున శాశ్వతపుణ్యలోకమును బ్రాసాదించితివి. నీ నిరుపమ భక్తవాత్సల్యమున కెంతయు ధన్యవాదము లర్పించెదనని ప్రణమిల్లి.

ఉ॥ మీరిడు శిక్ష మోక్షమును మించినదై యలరారి మీమహో
దారత జాటుచున్నయది, తావకపాద సరోజయుగ్మమే
జేరదలంచు నాకదియె చేకురె, గంగయసంగ నెత్తిపై
మీరు ధరించుచుండు పరమేశ్వరియొకద నాగభూషణా ॥

అట్టి పరమపూతమైన గంగాస్రవంతియందు, సర్వకాలము పడియుండు నా భాగ్యమే భాగ్యము. ప్రపంచోద్ధరణమునకై ప్రవహించు, పాతాళగంగయే నాబోటి దురాత్ములకు తగు స్థలంబు. అని పొగడుచు, గంగా, మహాత్మ్యంబు వర్ణింపసాగె.

సీ॥ అంగజాంతకు నుత్తమాంగ మారోహించి
పొంగిపోయెడు మంగళాంగి గంగ
కొల్చువారలకెల్ల కొంగు బంగారమై
రాణించు కరుణాంతరంగ గంగ
ఘోర దురాచార పారాయణుల ముక్త
సంగుల జేయు సారంగ గంగ
శృంగార రంగని శ్రీపాదమును గన్న
రంగదుత్తుంగ తరంగ గంగ
గీ॥ భక్తరాట్భగీరథు తపః ఫలమువలన
నింగివిడి, పృథ్వినొంగి యుప్పొంగు గంగ
నెంతకాలము పడియున్న నేమిలగ్గు
విగత భవపాశ కాశీనివేశ యీశ ॥

హామ దేవా! కృతార్థుడనైతి, మమకారమును ద్యజించి, అనేక దివ్యసంవత్సరములు తపోనియతి బ్రవర్తించిన మహా పుణ్యపురుషులు సైతము బొందరాని దివ్యపథము నా కనుగ్రహించితివి. కాని నా మానసమును గలంచు కామ్యంబులు కామ్యంబులు నన్నలముకొనియున్న యవి కరుణార్ద్రచిత్తుడవై, యీ నాయంత్య సమయమున బ్రసాదింపవేయని దీనాతి దీనుడై వేడుచున్న చంద్రగుప్త నీక్షించి మహాకాలుడు దయార్ద్రచిత్తుడై వత్సా నీ కామ్యములు నీవనుకొన్నట్టి స్థితిని జెందలేకున్నను, నాకింత మార్పులతో నెరవేర్పబడెడు. యర్థింపుమన్న చంద్రగుప్తుడు చెప్పదొడగె.

:— చంద్రగుప్తుండు పశ్చాత్తాపపడుట —:

దేవా!

సీ॥ ఏకపత్నీ వ్రతంబు నస్తోకదీక్ష
జరుపుచున్నాడ నే నింతవరకు పూని
యట్టి నాకిట్టి దుర్బుద్ధిపుట్టి కన్న
పట్టినే కూడదలపెట్టు టెట్టులొ దవె॥

దీనబంధూ!

శా॥ ఈ నాకన్నులు చల్లనౌనటుల నిన్నీక్షించుచున్నాడనే
కానీ చిత్తము వేయిజంపములలో గారించినట్లౌను స
న్మానప్రక్రియ బిడ్డగాంచి సుఖసామ్రాజ్యంబు బాలింపనే
యానందంబిటు లగ్గిపాలయె మహాత్మా దీనచింతామణీ॥

సీ॥ ఆనాడు వరముల నందికొంటయెకాని
యీమె జన్మించుటే యెరుగనైతి
పదియురెండేండ్ల ప్రవాసంబునందైన
నీతల్లి జనన మూహింపనైతి
తెలియు నిదర్శనముల నెంతగా జెప్పు
చున్న నాలోచింప నోపనైతి
దల్లిబోలిన చిట్టితల్లి యాకృతినైన
దిలకించి మదిచింతదీరనైతి
గీ॥ నేనువచ్చుటవిని మోదమూని యెదురు
వచ్చి కైదండ స్వాయముగా నిచ్చునపుడు
గాంచి భ్రమసిన యీపాడు కన్ను లింత
ఘోరకలిదెచ్చి పెట్టుట నేరనైతి ॥

శా॥ ఈనాచేతులు కాలిపోను సుతనే యెంతెంతగా జేసి నే
ర్మెుత్య నాల్క-యిది తాటిమట్టయగు నెన్నోకాంచె నే
వెంద నే
యూనా యియ్యది కాదుకాదొక యభేద్య గ్రావమా
గాక నా
కూసంగోరి వరించె నక్కటకటా ఘోరంబు నాజన్మము॥

నాజన్మకాలిపోను. నేనిందులకే ప్రపంచమున జన్మించితినా.

సీ॥ అద్దుముద్దుగ నాటలాడించుచేతులే
హరహరా సయ్యాటలాడఁగోరె

పితృప్రేమపొంగి ద్రవింపనో హృదయనే
శివశివా కళలంటె సిగ్గుచేటు
నాతల్లి ! చిన్నారి నాన్నా! యనెడునాల్క
ఛీఛీ, ప్రియా ! యన సిగ్గుమాలె
వెల్లివిరిసెడుప్రేమ విప్పార దగుకనుల్
కటకటా పెరదృష్టిఁగాంచగోరె
సీ॥ పరులచేడ్పాటు శాసింపవలయు నేనె
హరిహరీ కానికూళ్ళకై యాసపడితి
నన్నుబోలిన నీచ దుర్నయుఁడు ఖలుఁడు
లేడు ముమ్మాటికిని భువి లేడు లేడు ॥

మృత్యుంజయా నాయకృత్యములు నిట్టనిలువున దహించుచున్నవి. దుర్భరము దుర్భరము. తప్తతైలకటాహమున ముంపబడినను, అంగకములొక్కటొకటే కరుకు మొరకు కత్తితో ఖండించి, కారముచిందించుచున్నను, మరెంతటి ఘోరాతిఘోరతరమను శిక్షల విధించినను నా పాపమునకు ప్రతికా జాలదు. పరాత్పరా ?

—: చంద్రగుప్తుడు తన యభీష్టముల శివున కెఱింగించుట :—

శా॥ అత్యూర్జ్య ఎన్ననివిన్నవింపనగు నా యాంతర విన్యాసముల్
వెయ్యార్లుల్కలవేల? గుండె చెరునై వేధింపగాజొచ్చె నా
కుయ్యాలింపుము, బిడ్డతో సుఖముగా గొన్నాళ్లు పృథ్వీ స్థలిన్
నెయ్యంబొప్ప వసింపనెంతునిదె నా నిర్వేదముం దీర్పవే ॥

ఉ॥ ఎంతటి పాపినేయయిన నేను మనుష్యుడనే యభీష్టముల్
స్వాంతము నంటకన్విడవు సంతతికై తపియించినట్టిచో
ప్పంతయు నీకె వేద్యమగు, నస్మదభీష్టము దీర్చినట్టి మీ
యంతటి మూర్తి తత్ఫలితమంటకమున్నె విధింప బాడియే ?

కృపామయా నా యీ కడసారి వాంఛితము దీర్పుడు. సంతానమో, సంతానమో యని రేబవళ్లు పరితపించి, కాంచిన నా యేకైక సంతానమును, అయ్యో సిగ్గుచేటు ప్రథమ దర్శనములోనే పరమకిరాతకునిగ బ్రవర్తించితిని. ఆ నా చిన్నారి వంశాంకురమును పితృ దృష్టితో చూచి యొక్కసారి అయినను మన ముప్పొంగునట్లు కమ్మని ముద్దుగొని కాని మూర్థమాఘ్రాణించియుగాని, ఉత్సంగమున నునుచుకొని యానందించుటగాని, శివశివా, అట్టి మహదానందము ననుభవింపలేనైతి. కావున నోదేవా నా కోరిక కాదనక బ్రసాదింపుము. నే యాచించు రెండవ యర్థమును వినుడు.

చ॥ ఈ సుమకోమలాంగిని, మదేకతనూజను మీకు పత్నిగన్
జేసి తరింపగోరుకొను చిత్తము, మీ దయ, నీతినేమముల్
బాసినవాడనేయయిన పాపకు దండ్రిని కాకపోను, నా
యాసలు స్వీయధర్మ విఫులల్గకదా పరిణింపగానగున్ ॥

నా చేతులార నా చిన్నిపాపను మీ పదముల కడ సమర్పించి, మీకు వివాహంబొనరింప నా మానస ముర్విళ్లు లూరుచున్నది. నా కన్నారి పసికూననైతె మట్టి వాంఛనే చెంది

యున్నట్లు సూచించియుండెడె. తండ్రినగు, నేను, కాదు, కాదు, పరమపాపిష్టి కిరాతకుడనగు నాకట్టి ప్రాప్తము, అనుచు దుఃఖముచే మాటరాక, యట్టేయుండి దేవా యీ పాపకు తండ్రి ననుపించుకొన్న నాకీపాటి సౌఖ్యమునైనను బ్రిసాదింపుము. తండ్రీ యిక నా మూడవవాంఛ వెల్వరించెద, నాలకింపుము.

సీ॥ పచ్చబండగ గంగలో బడెదు నేను
కేలనైనను మిమ్ము నర్చించునట్లు
స్వ స్వరూపముతో పూజసల్పునట్టు
లానతీయవె శంకరా యఘవిదూర॥

మీాదయ యేమిచేసినను సరియె. ఈనికృష్టజీవికి, శాపాంతమైనకలదా. అదియులేదా యని.

—: శివుడు చంద్రగుప్తు ప్రశ్నలకు ప్రత్యుత్తరములిచ్చుట

సీ॥ అనుచురాల్కరుగంగ నోడాడు రేని
గాంచి మదిపొంగి యొక్కింక కనికరమున
పలికె నా చంద్రగుప్తభూపాలుగాంచి
భక్తచిత్తవిహారు డప్పరమ శివుడు॥

నాయనా చంద్రగుప్తా. నీవివరించిన యంశములన్నియు సత్యములే. నీయాంతర్యశుద్ధి నేమెఱుగనిదికాదు. నిక్కమగా నేకపత్నీ వ్రతమును నెరవేర్చిన పుణ్యమూర్తివే. అయ్యును, బలవత్తరమైన దుర్విధిచే నీవన్యకాంతా లాలసుడ

నగుట గొనెదవె. కన్నపట్టినే జెట్టపట్ట యత్నించు కట్టడి కృత్యా ముసకుసిన్ను రెచ్చగొట్టి యిట్టియుట్టిపాటు తెచ్చినది నీపూర్వ జన్మపాపఫలము. శాపోపహతుడవైయున్న కారణమున నీభవ ముస తత్పాపఫలం బనుభవింపదగు సమయమాసన్న మగుట వలన, నది నీ మానసమును కప్పివైచి యుక్తాయుక్త పరిజ్ఞాన శూన్యునొనర్చినది. అందున నింతవృష్టి. నీ శాప విధానంబు జెప్పెద నాకర్ణింపుము.

మ॥ ఇది నీ ప్రాప్తము పూర్వజన్మకృతమిట్లీనాటి గుబ్బంగి నీ
కొదవెణ దీర్పదరంబుకాదు, విను శాపోద్వేగ వృత్తంబు నీ
మదిగప్పణ గమనింపలేనయితి సన్మార్గాను వృత్తంబు న
య్యాది తీరందగు మంచికాలమిక రానె యోగ్యమై భక్తుడా

**చంద్రగుప్తుని పూర్వజన్మ వృత్తాంతము :—**

నీశాపవిధానము జెప్పెదవినుము.

సీ॥ పూర్వజన్మమున నపూర్వతపంబున
మద్దర్శనముగోరి మలయుచుండ
తద్విఘ్న మొనరింపఁ దలచి యింద్రుడు రంభ
ననిపిన దాని కేలాటలెంచి
వలజిక్కి కొన్నాళ్ళు వశ్యుడవైయుండి
దోసి క్రమ్మర తపోరూఢి నెరప

బోవుచో నిన్నాపి పోలతివేడిన విన
వైతి, వ్రుక్రోశయై వెళ్ళదిపల్క—
సీ॥ వలచివిలపించు చెలిపీడ దలచునీకు
నుత్తరభవంబునం దీవు బొత్తుగోరు
మత్తకాశిని నీ చిత్త వృత్తిరోసి
మిత్తమగానని శపియించి మింటికేగెనా॥

కోరరాని కోమలి కూటమి నభిలషించుటయు రంభా శాప ఫలమేయని గుర్తింపుము. నిన్నట్లు శపించి రంభ యథేచ్ఛ నిజలోకంబున కరిగినంత నీవు విచారింపక వెడలి హేమవన్నగంబున బెద్దకాలము దపమొనర్చి, మద్దర్శనము బొందకయె జీవముల వీడితివి. మా సేవ లూరకపోవునా? తత్సేవాఫలమువలన నీవీ పుట్టువునం దష్టయిశ్వర్య సంపన్నుడవై మహారాజుగ జన్మించితివి. పూర్వజన్మ తపఃఫలమువలననే యీ జన్మంబున మా దర్శనము నీకు రెండు మార్లొదవె, రంభాశాప ఫలమువలన నీ పాటు చేకూరె. ఇంక నీ యడిగిన యర్థంబుల వినుము.

సీ॥ కనియెు, కనకనో నిప్పు దొక్కిన ఫలంబు
ననుభవించిననే దీరు, వనటనొంద
మానునా? యట్లెచేయు దుర్మార్గ ఫలము
భోగ్యమగు దీరదెంత వాపోవుచున్న ॥

కం॥ మనుజుఁడు పశ్చాత్తాపం
బుననె పునీతుండుకాడు, పూర్వవిధానం

బును మాని చిత్తశుద్ధితో
మనిన నె తత్పాపఫలము మాయు నరేంద్రా ॥

ఉ॥ గాయముచేతఁ జెందనగు కష్టములందుచునే నివారణో
పాయము నెంచి మాన్పుకొనుభంగి నరుండు కృతాపచార ప
ర్యాయఫలంబు లొందుచు విహస్తుడునై తలమీఱి తారణో
పాయముగోరి సన్గొలచి పాపవిముక్తుడుఁనై చెలంగెడుఁ ॥

భక్తా, పశ్చాత్తాపమునొందిన మాత్రముననే పాపఫల
ములు తప్పబోవు. చేసినవారికి చేసినంతయను లోకోక్తి విని
యుండవా? మంచియో చెడ్డయో యేదియైనను, యిచ్చు ఫల
ములను తొల్దొల్ల ననుభవించియే తీరవలయు. నివృత్తిమార్గము
తరువాతి విషయము. నిప్పునంటినవాడు, బొబ్బలచే బాధపడియే
తీరవలయుననుట తథ్యముకాదా. అయ్యో ఏల దుమికితినని
యెంత పరితపించినను బాధతీరునా? అట్లే నీ దుష్కృత ఫల
మును, భోగ్యమెకాని, నీ పశ్చాత్తాపము వలన దీర్చరానిది.
అందువలన నీ శాపము నీవనుభవించియే తీరవలయును. కాల
విలంబము కాజనదు. అందువలన నీ ప్రథమవాంఛ నెరవేర్ప
బడదు.

రెండవ యర్థంబగు నీ కూతు వివాహముంగూర్చి పరి
పక్వస్థితినందిన పరిగ్రహింపబడునని గ్రహింపుము. సుఖపర్యవ
సానమేయని యూరటజెందుము.

మూడవదైన నీ వాంఛ ననుగ్రహించితి.

సీ॥ పవలు పాతాళగంగలో బచ్చబండ
వయ్యు రాత్రిల నిజరూపుసంది నన్ను
నిత్య మభిషేచనాది సన్నియమములతో
దనిపి, పోనాజ్ఞయిచ్చితి, గొనుము భక్త ॥

నీవడిగిన నాల్గన యర్థంబునుం వివరించెద.

కం॥ నీపశ్చాత్తాపంబున
పాపాచరణాను భావ్యఫలము తప్పదో
భూపా! యేల విచారము
శ్రీపతి రక్షించు నిన్ను చెలగెదవంతక॥

—: చంద్రగుప్తుని శాపవిమోచనము

సీ॥ కల్యంతమున లోకకళ్యాణ కృషికి శ్రీ
ధాముడు కలికావతార మెత్తి
పాతనాశకుల దుష్టమార్గానువర్తుల
ఖండించి శిష్టరక్షణ మొనర్చ
వేదమతోద్ధారణాది సద్ధర్మముల్
నిలుపుచు తీర్థయాత్రల నొనర్చ
నా క్షేత్రమైన శ్రీ నగరమునకువచ్చి
నన్ను సేవించి ధన్యతనుగాంచు

గీ॥ అంత పాతాళగంగకు నరిగి యందు
స్నానమొనరించు సమూర్తి చరణరజము

శోక పాపవిమోచన సుఖము దొరకు
స్వస్వరూపముఁబొందెదో చంద్రగుప్త॥

తే. గీ॥ (శ్రీ)మహావిష్ణు సత్కృపచేత నీకు
పట్టణము పూర్వవిధి నొప్పు ప్రభుడవగుచు
నిష్టకామోప భోగము లెలమినంది
యంత్యమున మమ్ము జేరు కళ్యాణ మొదవ॥

ఇక నీ ప్రాప్తమింతియే జనుమని యాసతిచ్చి కృత్తివాసుడు, చంద్రమతీదేవిని విలోకించి కామినీ, యీ మహార్థము నుగ్రహించి, యథోచితకృత్యముల నెరవేర్చి ప్రాప్తమనోరథవై మమ్ము జేరగల్గుదువు.

సీ॥ అంకురించినమొలక మ్రాకైన గాని
పక్వఫలములనీలేదు భక్తియంతె
దోహదమొసర్చి శత్రులదోలి గాలి
కదుపులకుదాళి ఫలములగాంచు మబల॥

అని పరమేశ్వరుం డంతర్హితుండయ్యె. చంద్రగుప్తుని పట్టణమొక మహాగర్తమైపోయె. తత్పట్టణవాసులెల్లరు నిజేచ్ఛలంజనిరి. చంద్రగుప్తుడు, వెనువెంటనే పచ్చబండయాకృతి బొంది యాకశంబునకెగసి పాతాళగంగయందు పడిపోయె. ఇవ్విషయములన్నియు కన్నులగాంచుచున్న చంద్రమతీదేవి నిర్విణ్ణహృదయయై వెరబొమ్మకైవడిచూచుచు, కొంతవడికి వివశయై

ధరాతలంబునంబడిపోయె. ఒకయామమిట్లుగడువ తదనంతరంబున మేల్కాంచి చుట్టుం గలయఁపరికించి యెవ్వరింగానక భయవిహ్వాలరై యనేకభంగుల పరితపించుచు ఎలుగెత్తి శంకరా! మృత్యుంజయా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఏమి లీలలివి యని, ప్రత్యుత్తరములేమి, వగచుచు.

—: ఒంటరిపాటుననున్న చంద్రమతీదేవి విలాపము :—

ఉ॥ తల్లియు, తండ్రియుం, గురుఁడు దైవము, నేస్తము, నాప్త బంధువుల్
వల్లభుఁడుం సమస్తమును వాఁడెపరాత్పరుఁ డీశ్వరుండు నా
యుల్లమునందు నమ్మికొని యున్న ననుం వెలిబుచ్చి యయ్యయో
చల్లగ జారిపోయె నికచాన నొకర్తుక నేమిసేయుదుం॥

అని కొంతవడి యాలోచించి

ఆ॥ వె॥ ననుబరీక్షసేయ నాథుడే యత్నింప
దాళియుండ నెంతదాననేను
కర్మననుసరించి కానైన కార్యముల్
కాకపోవు, జగతి ఘనులకైన

నా జీవితమెంత ఘోరమైనది.

ఉ॥ ద్రోహము నేతలంచి కడురోతల నెంచెను గన్నవాడు సో
త్సాహమునం ననున్నెనుచు తల్లిగతించెను బాల్యమాదిగం

నా హృదయాధి నాథుడని నమ్మి భజించిన కృత్తివాసు డు
త్సాహము జూపడయ్యె నెటు తాళుదు కాలము నెట్లు
బుచ్చెదన్

ఓం శ్రీ హరహర మహాదేవ శంభోశంకర, భవనా
శంకర, భక్తవశంకర, యని యనేకవిధముల స్తోత్రము జేయుచు,
కృపామయా యిట్టికట్టడిపా టొదవింతువని కలనైనదలుపనైతి.

ఉ॥ ఉల్లము పల్లవింప భరమోర్తునటంచు దలంతుగాని యి
టల రిపెటి క్రూర గహనాంతరసీమల నొంటిపాటు వా
టిల్లెడు భంగి గూర్తువని యెన్నడునే దలపోయ నయ్యయో
చెల్లునె యిట్టిశోధనము స్త్రీలుభరింతురె ఘోరకృత్యముల్॥

కటకటా నాపాటు నేటికీవిధముగ పరిణమించినదా.

సీ॥ దైవమని మ్రొక్కబోయిన దయ్యమయ్యె
యమృత రసాపానవాంఛ విషాప్తమయ్యె
దామమనిదాల్ప సర్పమై దరిమివైచె
నెట్లు సైరింతు దిక్కు నాకెవ్వరిచట ॥

ఏమిగతి కానున్నట్లు. మృత్యుంజయా నిన్ను నమ్మి బాల్య
మాది సేవించుచున్నందుల కిదియా నాకు ఫలము? నీ భక్త
చింతామణి బిరుదనేమయ్యె, ఆశ్రితమందారుడనుటయర్థవంతము
కాదా! ఆర్తత్రాణ మహాఖ్య, వ్యర్థవాక్యమేనా! భయార్తుడైన
మార్కండేయుని బ్రోచి, మృత్యుంజయ బిరుదమును బొందిన

దబద్ధమా ప్రార్థించిన పర్వత నందికేశ్వరుల పరిపాలించుట, సత్య మేనా. అయినన్నాపై నేలకరుణ జూపవు. నీదయ యింతమాత్ర మేనా! అయ్యో నేనెంతబేలనైతి. కనుమూసి తెరుచునంతలో మాయమగుదువనిగాని, నాగతి యిట్లుజేసెదవనిగాని, కలనైనఁ దలుపకపోయితినే! నన్ను మోసగించి కన్నుమరపించి పోవుటకెంత పనియున్నదో నీకు శంకరా.

—: చంద్రిమతీదేవి నిందాస్తుతి :—

ఉ॥ బూచులు తోందరింతురని పోయితివా మెడజుట్టియున్న నీ
త్రాచులు దప్పిగొన్నవని దాటితివా నగరాజ పుత్రి నో
రాచ్చదటంచు పెన్భయము నందియె కావలె పారిపోతివో
నేచకకంఠ యెంత లతిక్రమింగెడు భీతుఁడవోయి చిత్రమా ॥

ముష్టికేగుటకు వేళ యతిక్రమించుచున్నదని పరుగెత్తి యుందువు.

చం॥ పంచపాది॥ అగునగు, ముష్టికింజనకనాగిన పస్తైకదా
త్బుదాతురుం
డగు కొడుకేమికావలె షడాననుడూకొనునా మృడాని నీ
మొగములు వాచుబెట్టగొకొ మూషిక వాహనమెక్కి
నందనుం
డగడునరాడో నిన్వేదుక నార్తులపోడెటులున్నఁ గొంపలో
తగులము దిద్దుకొంటయెకదా తమబోటి సరాగుల నిత్య
ధర్మముల్ ॥

# శ్రీ శైలేశ చరితము

కృత్తివాసా, నీవు మహానుభావుడవైనావయ్యా!

కం॥ మగధీరుఁడనుట నీకే
దగు, నొక్కఁత నెత్తిపైన, తాండవమాడన్
మొగమోడక మరియొక్కఁత
తెగువరియై పంచుకొనియె దేహార్థంబున్ ॥

ఆ॥ వె॥ కోరికట్టుకున్న కువలయేక్షణలకె
మింగబెట్టలేక మిడుకుచుండ
వలచి పైనబడెడు వనితనెట్లు భరింతు
తిరిపె మెత్తుకొంత తిప్పలగును ॥

ఆ॥ వె॥ వల్లకాడులోని వెల్లబూడిదబూసి
తెల్లయెద్దునెక్కి యిల్లు నిల్లు
తిర్గి తిరపమెత్తు తెగువ నీ సొమ్మొకా
నొరుల కిట్టిచేత తరమె సాంబ ॥

నీ కుటుంబముకూడ చాల చిత్రమైనదే.

కం॥ గిరికొంప ముసలిభార్యలు
కరిమొగము గలాడు, మోసగాడు కుమారుల్
తిరిపెంపుకూడు, బూచులు
పరిచారకు, లెంత భాగ్యవంతుడవోయీ ॥

ఆ కొంపలో నిద్ర ఎట్లువచ్చునో అదియు దురూహ్యమే.

గీ|| పగలు భార్యల కొట్లాట పాముబుసలు
పోతు అంకెలు వీనితో ప్రొద్దుగడచు,
రేలు దయ్యాల పెనుబొబ్బరింతలుండు
నిద్ర నీకెట్టుపట్టునో నీలకంఠ ||

నీవట్టివాడవు కావుననే నీస్థితి యెక్కడను చెల్లకుండ పోయినది.

సీ|| క్షీరోదధింగాంచ ఘృతము దేవులు త్రావ
హాలాహలమ్ము నీపాలబడియె
సృష్టింప, మెట్టింప, స్రష్టాచ్యుతులుగాన
గిట్టించుపని మెడజుట్టుకొనియె
సురలెల్ల రుజ్వలాంబరముల గైకొన
పులితోలు మొలబెట్టు పున్నె మొదవె
షడ్రసాన్నంబులచవి దేవులాసింప
తిరిపెపుకూటితో మురియుటాదవె

గీ|| త్రిగుణముల రెండు గైకొని దేవులొప్ప
చివరి తామసగుణము నిజ్జెందిపోయె
నట్టిమూర్తివి స్థాణువ్వైన నిన్ను
వలచి పిలిచిన ఫలమేమి కలుగుసాంబ||

నిష్ప్రయోజనమైన యాసపడి నేను వెతలపాలగుటయే కాని ఫలమావంతయు గలుగునెడు నాసయు కన్పించుటలేదు.

ఆ॥ వె॥ కోరికట్టుకొన్న కువలయేక్షణలలో
పాత్తుపోక నొకత నెత్తికెక్క
యర్థదేహమొక్క యతివ పాల్గొనె నింక
నాకుస్థానమేది నాగభూష॥

అని పరిపరి విధంబుల దూలనాడుచు

కం॥ నిలువెల్ల విషమునీకొ
ఖలుఁడవు నినునమ్మలేను కాకోదరముల్
పులిచర్మము పుఱ్ఱె మహో
జ్వాలభూషలు, కట్టుగుడ్డ పాత్రనీకగుర॥

ఇట్టి మహనీయమూర్తివి నిన్నుగట్టుకొని మాత్రము నేను సుఖించునదేమి. గట్టురాయనిపట్టియే నీకు తగినయిల్లాలు. మొట్టికాయలలోనె నీయుట్టిపాటడగుకాని, మ్రొక్కువారి త్రొక్కివేయుటె నీచందనుగు నని యనేకవిధంబుల నిందాస్తుతులొనరించుచు, కొంతవడికి పొరవడితినని గ్రహించి పరంధామా. నన్ను క్షమింపుము నిందించితినని వందుకులం బెట్టకుము నాయిప్పటిచందమున గుండెప్రీలి, కడుపుమంటచే నట్లాడితికాని యన్యథాత్వము లేదు. మన్నింపవేయని వేడుచు ననేకవిధముల స్తోత్రము జేయుచు వెఱ్ఱిపట్టినదానివోలె సంచరించుచు.

కం॥ ఎందుకునాజన్మము నిను
బొందంగతిలేని వాంఛబొందితి జెడితిఁ

కుందుభరించదు డెందము
జెందెన నిర్వాణపదవి చేరెద నిన్నున్

అనుచు నిశ్చయించుకొని, పరమసాహసికయై యచ్చట నేలపైబడియున్న యొక నల్లగుండురాయి జేతంబట్టి యీశ్వర ధ్యానము జేయుచు.

సీ॥ అణువు మొదలుగ బ్రహ్మపర్యంత మీశ
గలవు శరీరములో దార మెలయునట్లు
శివశివా శంకరా నీలో చేర్చుకొనుము
వచ్చుచున్నాను జీవములు వాసి యిపుడు ।

ఏమాత్రమును వెనుదీయక నానల్లగుండుచే శక్తికొలది శిరంబున బాదుకొనియె.

చం॥ అదియొక పుష్పగుచ్ఛమై యయ్యెలనాగ శిరంబుడాకు వో
ముదితయెఱింగి ఈశ్వరు నమోఘ కృపామహిమంబుచేతనే
మొదవెనటంచు బొంగి కడునొప్పుగ పాడుచు నాడుచుం
మహాముదమున సొక్కి సోలుచును ముద్దియ నిద్దుర చెందె
నచ్చటన్ ॥

భక్తురాలి మొరలాలించి పరాత్పరుడు నందీశ్వరు నామె పోత్రిలికింబంచిన నతడు.

సీ॥ ఈశ్వర ప్రేరణమున నందీశ్వరుండు
గోపబాలకు రూపముంగొని రయమున

మొదవులం దోలుకొనుచు నమ్మేలతయున్న
యడవిప్రాంతము లన్నడయాడ దొడగె ॥

అట్లు ఆవుల మేపుకొనుచు గాఢనిద్రలో మునిగియున్న అమ్ముద్దియ నిద్దురలేపు తమకంబున నచట నొక వృక్షచ్ఛాయ యందొక శిలపై సుఖాసీనుండై ఆనందముగా వేణువు నూదుచు నపర శ్రీకృష్ణమూర్తియో నా చెన్నారుచుండె, ఆ వేణుగాన మాధుర్యమునకు, సోక్కి మృగజాలంబు లన్నియు, విన్న మూగుచుండ, కఠినపాషాణములు సైతము కరుగుచుండెను.

— నందీశ్వరుడు గోపకుమారు వేషమున చంద్రమతీదేవిని బాయుట —

సీ॥ మేత మేయుటమాని మొదవులు తలలెత్తి
దోరచెవులం దమిదీరుచుండ
వనమయూరములు విచ్చిన పుచ్ఛముల నెత్తి
శృంగార నృత్యము ల్సేయుచుండ
వల్మీకములు వీడివచ్చి యుప్పొంగుచు
సర్పముల్ నాట్యమ్ము సలుపుచుండ
నాకసంబున రెక్కలార్చుచు బికములు
గ్రమ్మి కైవారముల్ గట్టుచుండ
గీ॥ వన్యమృగములు గుంపులై వచ్చునట్లు
కఠిన, పాషాణవితతులు కరుగునట్లు
లపర కృష్ణావతారి యయ్యర్భకుండు
వేణునాద మొనరుచు వెలసెనందు ॥

చంద్రిమతీదేవి కొంతవడికి తెప్పరిల్లి నిదుర మేల్కాంచి తన యెదురనున్న గోవులను గ్రోవి నూదుచున్న గోపకుమార వేషధారిని గాంచి విస్మయ చేతస్కయై వాని డాయంజని కుమారా నీ వెవ్వరివాడవు ఒంటరిగా నియ్యడవియందుండ గతంబేమి నీ పేరెయ్యది, యని యడిగిన నక్కుమారుండు నగుచు, తల్లీ నేను పసుకాపరిని, నాకొక యూరేమి పేరేమి. ఎవ్వరేనామమున బిలుతురో, యదియే నాపేరు. నేనెచ్చట సంచరించుచుందు నదియే నా యూరు. నేనొంటరివాడగాను, నాకు తలంతబలగము కలదు. అయిన వారితో నాకేమిపని. సర్వకాల సర్వావస్థలయందును నన్నంటి నాతండ్రియుండి కంటికి ఱెప్పవలె కాపాడుచుండును. ఒంటరివాడనను భయము నాకే ముండు. భీతికిభీతి పుట్టించు పితయుండ నాకేమి కొదువ. అడవి యందుండుటయన్న నాకు చాల యిష్టము. పాపభూయిష్టము లైన జనపదముల నేరోయుదు. హాయిగ నా పశువుల మేసి కొనుచు, నిర్మలమైన ఈ విజనారణ్యమున సంచరించుచుందును. ఆరోగ్యవంతమైన యావుపాలు, లభ్యమగు వన్యఫలములు, తేటయగు సెలయేటి నీళ్లు కల్గియుండ ఆహారమునకు మాత్రము లోటేమి యున్నది.

సీ॥ ఎచటనుండునొ యూరదే, యెవ్వరెట్లు
నన్ను పిల్చెద రాపేరెనాది వన్య
ఫలములును క్షీరములు భోజ్యభాజనములు
కావలయునేమి నా కంతకంటె వేరు ॥

తల్లీ యిది నా సవిస్తరము. మీరెవరమ్మా ఒంటరిగ నీ యరణ్యమున నున్నారు.

దీర్ఘములగు నిట్టూర్పులు పుచ్చుచు నాయనా నేనొక దిక్కుమాలిన యభాగ్యురాలను.

గోపు॥ ఏమిటా వెఱ్ఱి దిక్కులేరంటా వేమమ్మా!

సీ॥ నీకు, నాకును, నీ సర్వలోకములకు
నేకపిత, యీశ్వరుండుండ నేలనమ్మ
దిక్కులేదని యేడ్తువు, తినను పండ్లు
ద్రావ జలమున్న భాగ్యమేలావమాటి ॥

అమ్మా ఏడవడం చాలా తప్పని నా తండ్రి నాకనేక పర్యాయములు చెప్పియున్నాడు. నేనెన్నడాపనిచేయను. ఇక మీరుకూడా అట్లనే వుండాలమ్మా, ఇంతకు మీరేడవడ మెందుకు. ఒంటరిదానననేనా, నేనున్నాగా మీకు సాయంగా వుంటానికి. మీరేమిచెప్పిన చేస్తాను. ఏమికావలెనంటె అవి తెచ్చియిస్తాను. ఇంక మీకెందుకేడ్పు, తల్లి ఇంక సుఖంగా వుండండి. అని చెప్పెడు నర్భకు మాటలాలించి, యాశ్చర్య పడుచు.

ఉ॥ జేనెడు లేడు చూచుటకు, చెప్పెడుమాటలు చేయుచేష్టలున్
మహానులకేని సాధ్యమగు మార్గము కాదనిదోచు నెవ్వడీ

కూాన, యిటులవచ్చె నొకకోర్కె-యులేని విరాగి పోల్కెగా
దేనియెటూరబల్కె-, విన తీయగదోచు, నిదేమిచిత్రమో ॥

అని యాలోచనాధీనయై యుండ సబ్బాలు డామోరో.

గోపు॥ తల్లీ ఏమో ఆలోచిస్తున్నారు. నా మాటలు మీకు విసుగ్గాయున్నావా, లేక నేపల్కినవాసిలో నేమైన తప్పులున్నవా, అట్లైతే చెప్పుతల్లీ, నేనింక మాట్లాడ కుంటాను.

చంద్ర॥ లేదునాయనా లేదు. నీ మాటలు విసిగించేవికావు. వికసింపచేసేవి. ఏదో ఇట్లాంటివే యింకా కొన్ని మాటలు చెప్పునాయనా విని సంతోషిస్తాను.

గోపు॥ అట్లనే అమ్మా ఇవన్ని మా తండ్రిచెప్పూవుంటే విన్నవే కాని నేను స్వయముగా నెరిగినవి కావు. వినవమ్మా చెప్తా.

సీ॥ మెత్తనిపాన్పుపై నత్తమిల్లినగాక
నిదురరాదా? వట్టినేలపైన
షడ్రసాన్నంబులఁ జవిగొన్న నేకాక
తీర్పదా క్షుధ మంచి తీర్థమైన
చీనిచీనాంబరశ్రేణి దాల్చినగాక
మొలగప్పదా నారవలిపమైన

రమ్యహర్మ్యంబుల రాణజెందినగాక
నెలవొప్పదా చెట్టునీడనైన
సీ॥ కల్పితానేకభోగభాగ్యములగాక
గడువదా జీవితము దైవికముగనైన
తల్లికో యోల యుల్లము తల్లడిల్ల
ప్రకృతి మాతయె రక్ష ప్రపంచమునకు॥

చం॥ మనసును జిక్కపట్టిననె మార్గము చిక్కదు తోన శాంతియుక్
బనుపడు రాగవేగములుబాసి యవిద్య నసించు నప్పుడే
మననము జేసి జీవపరమార్థము జెందు క్రమక్రమంబుగన్
జననిరో చిత్తశుద్ధియె ప్రశాంతికిమూలము వేయునేటికిన్ ॥

కావున నోతల్లీ మీరు దుఃఖాన్ని పోగొట్టుకొని నిశ్చలంగా దైవప్రార్థన జేసినారంటే, అన్ని వాటంతట అవే తీరిపోతవి. ఇంతటి నుంచి నీవు అక్కవు, నేను తమ్ముడను. నాకు నీవు, నీకు నేను తోడు. మనిద్దరము హాయిగా ఆడుకుంటూ, కమ్మగాపాడుకుంటూ, భజనానందంతో నృత్యము జేసుకుంటూ దొరికినపండ్లు తిని పాలుత్రావి సుఖంగా కాలము గడుపుకొందాము. అదుగో కన్పడుతున్న దే అదే మనకుటీరము. రాఅమ్మ యికనక్కడికి పోదాము. ఊం ఏమంటావు. ఇదీ ఎంతో కాలము కాదు లే. మాబావ వచ్చిన నిన్నాయన కప్పగించి నా అంతట నేను వెళ్ళిపోతాలే. మీ కిష్టమేనా? ఏమీ కాక పలకవు. అని

యనుచున్న బాలుని యమృతములౌ పలుకు ముద్దుమాట లాల
కించి ముదిత హృదయయై చంద్రమతీసాధ్వి.

శా॥ అన్నా ! ఎన్నడు నేర్చినావు కడునాహ్లాదంబు బుట్టించు నీ
విన్నాణంపు విశేషభాషలు, మహా విజ్ఞానులే జెందలే
రన్నం నీకెటు ప్రాప్తమయ్యె గదు బాల్యంబందె సద్విద్య లీ
తెన్నుంజూపిన దేశికుండెవరు చింతింపంగ నాశ్చర్యమౌ ॥

శా॥ ఏదీ, యింకొకమారు పల్కు, వినగానింపై రసస్ఫూర్తియౌ
నా దౌర్భాగ్యము కొంతవట్టుకైనన్నాశంబు గావించు నే
మో దైవంబటు నీ స్వరూపమున నన్నోదార్ప విచ్చేసెనో,
గాదా ఇట్టి విచిత్రవృత్తము వినంగానేని యెచ్చోటనుర్॥

తే॥ సీ॥ ఏనమిదేండ్లైన నిండని యీడు, యీడు
మాటయా జన్మశోధించు గీటురాయి
హృదయమా ద్రవించి స్రవించి ముదము హెచ్చు
బాలుడా వీడు పర్వతేశ్వరుడుకాని ॥

అనుచు నాశ్చర్యపడుచున్న చంద్రమతి దేవింగని

—: నందీశ్వరుని వేదాంత బోధ :—

అమ్మా ! నీవనుకున్న దొకటియుగాదు నే నీశ్వరుడను
కాను. నీకు నాకు, సర్వలోకములకు నీశ్వరుడొకడే. అతడే
మానవులనందరిని రక్షించగలాడు. ఆతని క్రీగంటి చూపువలన నే

మనమందరము, దరింపగల్గుట. నాకు దేశికుడు, తండ్రి, త్రాత, తల్లి, దైవము, వేయేల నా సర్వస్వమా పరమేశ్వరుడే.

నాకేయేల, నీకుకూడా అంతే. అక్కా ఎందుకంత యూయూస పడెదవమ్మా ఈ విషయములన్నియు నింతకుముందే చెప్పియున్నాను. నీవే గ్రహింపలేకున్నావు (ప్ర)పంచమంతయు నిట్టి యజ్ఞానముచేతనే యలమటిల్లి పోవుచున్నయది. నిజానిజ ములు గుర్తింపలేక ఏవో కొన్ని తెలిసి తెలియని మాటలు చెల్పినమాత్రమున వానినే పరమేశ్వర స్వరూపునిగా భావించి, సకలోపచారము లాచరించుచు, వ్యర్థకాములై వేగుచుందురు) నిజము విచారింప జీవుడే, దేవుడు. దేవుడే జీవుడు.

సీ॥ పొట్టుతోనున్న గింజ నూరా, పొట్టువిడిన
బియ్యమగు, నట్లే కర్మచే బీడితుడగు
నప్రుడు జీవుడనంబడు నది నివృత్తి
యైనచో దేవుడనబడు నంబ వింటె ॥

సీ॥ అగ్నిలో రేగు మిణుగురు లన్నిదిశల
బడియు స్థలభేదమున గొన్ని ప్రజ్వరిల్లు
రూపుచెడు కొన్ని, యటు విరాడ్రూపు నుండి
వెడలు జీవులకగు క్షేత్రవిధము జేసి ॥

సీ॥ ఆత్మకుగా వ్యతిరేకమానట్టిదైన
జడము సర్వము నసియించు స్వప్నమట్లు

చేతనాచేతనముల వీక్షించు నెవఁడో
ఆతఁడే యచ్యుతుఁడు శివుఁడనగ జెల్లు ॥

సీ॥ బొరయు నంతఃకరణ కలవరముచేత
సత్యముఁ గసత్యముగ జూడఁజాల డజ్ఞుఁ
డందుచే పరివేదన లందియుండి
యమలవిజ్ఞాని బ్రహ్మము నందలేఁడు ॥

సీ॥ కర్మపాశము విడువక గట్టునపుడు
జీవుఁడనఁబడు తొలఁగుచో దేవుఁడగును
దేహమే దేవళము జీవి దేవుఁడందు
తమసమునువీడి కొల్చుచో ధన్యుఁడగును॥

తల్లీ యిట్టి విషయములన్నియు, మాతండ్రి నాకల్లా ముగనాకు బోధించె. కాని, నాకు తెలిసినంతవరకు మీకో చెప్పకల్గితిని. ఈ ప్రపంచమె యొక నాటకశాల. అందు జీవులు పాత్రధారులు. ఆడించువాడె పరమాత్ముఁడు. అజ్ఞానమున జీవు లాడుచుందురు. నిజానిజములు గుర్తింపలేక గుర్తించినవారి పలె నభినయించుచు, ప్రపంచమును మోసగించుమహాసీయులు కొండ కలుగక పోలేదు. రూపమునుబట్టిగాని, వయసునుబట్టి గాని నిజముగుర్తింప వీలుండదు. నేనిన్ని చెప్పుచున్నను నీకు తమ్ముఁడనిపించు కొనుటయుగాని అన్నను కాజాలను.

సీ॥ స్వప్రకాశముతో తామసమునడంచు
రత్నములు రాళ్ళయయ్యె గిరాకి హెచ్చు

మెరుపురాశ్లిర్క కాంతిచే మెరసి మెరసి
కనులు మిరుమిట్లుకొల్పి చీకటినిడాగు॥

కావున తల్లి, నిజానిజములు గుర్తించు యోగ్యత కల్గిన నాడే ముక్తిప్రాప్తించు. అట్టిది చేరువకాకపోబట్టియే నిట్టి స్థితి జెందితివి. దీనికై వగవంబనిలేదు. పరమేశ్వరుడు కరుణాసము ద్రుడు. సిక్కనముగ నీబన్నములం బాపగలడు. దుఃఖమును వీడి యాతని భజింపుచుండుము, నేను నీవనునిట్లే సద్విచార మున సుఖముగ కాలక్షేపము చేయుదము. రా తల్లి కుటీరమున కేగుదమని చెప్పు బాలకు దివ్యోపదేశంబు మనంబున కూరట గొల్ప సంతసించి. నాయనా తమ్ముడూ! రా వెళ్లుదమని యిరు వురు కలసి కుటీరమునకు వెళ్ళి యందు నిశ్చింతతో కాలము గడుపుచుండిరి. ఇట్లు కొంతకాలముగడువ. గోపబాలకు డాప్తుల తోలుకొని యటవీ ప్రదేశములకరుగ నొంటరిపాటున నున్న చంద్రమతీదేవి కేమియు దోపక తనలో దేవా దీనజనమం దారా. నీకింకనైనను దయరాదా. ఇట్లొసని యొప్పుడు దలచి యుండుట లేదు.

—: చంద్రమతీదేవి ఈశ్వర ప్రార్థన :—

సీ॥ నూత్న యావనశోభ నూగారు తొలివేళ
ప్రేమబీజములు హృత్సీమనాటి
రుసంపు మొలకలంకురితపరా నందాక
వలపులరసమూర్చి చిలుకదించి

మొలకరించిన ముద్దుముచ్చట్లు జడివాన
జోరుగా కురిపించి నీరుగట్టి
ప్రకృతిలోనున్నట్టి ప్రణయసత్వమునెల్ల
హృదిఁ జేర్చి దానితో యెరువుబెట్టి

గీ॥ మన్మనఃక్షేత్రమందు సంపన్నభంగి
ప్రణయసస్యము పండించి ఫలముగొనెదు
చతురహాలికుడవోదని స్వాంతమందు
దలచితిగాని యిటు ఫలితుదలపనైతి॥

శా॥ ఈ నా దేహము, ప్రాణమానములు నీకే యంకితంబయ్యె నే
లా నన్నేలఁగరావు నా పయిని రాదా మీ కటాక్షంబు, ఇం
కేనా? నాగతి, యట్టులేయైన చో యీ బుద్ధి పుట్టించు టే
లా పన్నీవిధి జిన్నబుచ్చుటలు మేలా నీకు లోకేశ్వరా ॥

శా॥ ఔరా! శ్రీ మీ మగవారి నైజమదె, నేమైవచ్చి ప్రార్థించుచో,
దూలంజేతురు, మీకవశ్యమగుచో దోబూచులర్థాంగలన్
లాలింబెట్టుట, జోలపాడుటయు, కైలాసంబుజూపించుటల్,
హాలాహలము గొంతులోన, సుధ జిహ్వాగ్రంబునం మీ
కగున్ ॥

సీ॥ బాపురే యెంతలోకువో పడతిబ్రతుకు
గడ్డిపోచలకన్న జుల్కన యసూవె
పురుషు లేపాటుపడినను సరియయంద్రు
వారి వారించువారలెవ్వారు లేరు